మొదటి ముద్రణం
౧౯౫౧

విషయములు :



Saraswathi Power Press, Rajahmundry
Printed and Published by
A. Nageswara Rao
For Addepally & Co., Educational Publishers
Order No. 6026/1951

# ఆంధ్రహృదయము

## ౧

ముచ్చట గూర్చు గుఱ్ఱపుబండి దిగి నవయౌవనుడగు రాధాకృష్ణ రాజమహేంద్రవర రైల్వే స్టేషను మాస్టరు ఉద్యాన పరివృత మందిరమును ప్రవేశించుచున్నాడు. కిటికీలో నుండి మిత్రునిరాక గాంచిన మాస్టరుపుత్రిక యగు గ్రేస్ దొరసాని యౌవనాశాహృదయ ముప్పొంగ నగుమోముతో ద్వారమున వ్రేలాడుచున్న పట్టుతెర తొలగించుకొనివచ్చి అతనికి స్వాగత మిచ్చినది. యజమాని యాజ్ఞానుసారము బండివాడు నూతన సంవత్సరాది ఉపహారములను లోనికి దీసికొనివెళ్లి మేజాపై నుంచి వెళ్లినాడు.

పనికత్తె రొయికర్తుక "కృష్ణబాబు ఏవోబహుమతులు తీసుకొచ్చాడు" అనుకొనుచు నటుబోవుచుండుట జూచి రాధాకృష్ణ ఆమెచేతిలో నొక రెండురూపాయిలు పెట్టి "పండుగకేమైనా కొనుక్కో" అన్నాడు. అది వంగివంగి సలాములు చేయుచు ఆనందముతో వెడలిపోయినది.

గ్రేస్ దొరసాని నవ్వుచు "లోపలికి వెళ్ళుదాము రండి, మిస్టర్ కృష్ణా! కలకత్తామెయిలు వెళ్ళిన తర్వాత మానాన్నగారు వస్తారు. ఈలోపున అమ్మ మీకేదో కబురు చెప్పుతుందట వినవచ్చు" అన్నది. ఇరువురు నూతన యౌవ

నులు మెల్లగా లోనికివెళ్ళి మేజా కిరుప్రక్కలనున్న కుర్చీలలో నాసీనులైరి.

రాధాకృష్ణ మధురమందస్మితవదనమున "మిస్ గ్రేస్, నేనిక్కడి కీరోజు ఊరికే రాలేదు. మీతో క్రొత్త వేషం వేయించడానికి వచ్చాను. అచ్చంగా మిమ్మల్ని ఆంధ్ర యువతిని చేసివేయడానికి వచ్చాను. అందుకు ఒప్పుకుంటారా?" అన్నాడు. సూక్ష్మబుద్ధిమతి గ్రేస్ దొరసాని. రాధాకృష్ణుని తేటమాటలలోని దివ్యసంగీతము ఆమె ఆనందహృదయమున నాలకించినది. చిఱునవ్వుతో "ఆంధ్రదేశంలోపుట్టి, ఆంధ్ర వాతావరణలో పెరిగి, మీవంటి ఉత్తమాంధ్రులతో స్నేహం చేసి, కొద్దోగొప్పో ఆంధ్రము చదువుకొన్న నేను మీకోరిక ఎల్లా తిరస్కరించుతాను. ఆసంగతి మీకు మాత్రము తెలియనిదా ఏమిటి" అన్నది.

కృష్ణ "మిస్ గ్రేస్, మీ రలాంటివారని తెలిసే ఇవ్వాళ ఇటువంటి బహుమతులు తీసుకొచ్చా" నని ఉపహారముల పళ్ళెరము పైనున్న రంగుఅంచులరుమాలు తీసి అందున్న ఆకసపురంగు పట్టుచీరె, చాక్ లెట్ రంగు క్రొత్తరకపు జాకెట్టు గ్రేస్ చేతులలో బెట్టినాడు. ఆమె ఒయ్యారముతో గైకొని "మెనీథాంక్సు, మిస్టర్ కృష్ణ" అన్నది. కృష్ణ "మొన్న కలకత్తానుంచి వచ్చినప్పుడు బాగాఆలోచించి పరీక్షచేసి మరీ తీసుకొచ్చాను. మాచెల్లెలుకూడా "చాలా బాగున్నది, రంగు మెంచడము అన్న" దనుచుండగా స్టేషనుమాస్టరుభార్య వచ్చి

"మిస్టర్ కృష్ణా! మీరొచ్చి ఎంతసేపైంది. నేను చూడనే లేదు మిమ్మల్ని" అన్నది. రాధాకృష్ణ చిరునగవుతో "సంవత్సరాది రోజున మీరు నన్ను చూడలేదంటే సంవత్సరమంతా యిల్లాగే ఉంటుందన్నమాట. ఈబహుమానాలు స్వీకరించండి" అన్నాడు.

ఆపళ్ళెరమున ఇంకను విలువగల కేక్సు, ఒక బంగారు చేతి గడియారము, మంచిముత్యాలహారము, ఒక బంగారు బ్రూచ్, పాంపిరోసెంటు, లోషను, సిల్కు చేతిరుమాళ్లు డజను, సిల్కుగొడుగు, నూతనసంవత్సరాది కార్డులు నున్నవి.

అప్పుడే స్టేషనుమాస్టరు వచ్చుట చూచి రాధాకృష్ణ లేచి "గుడ్‌మార్నింగు" అని షేక్‌హేండు చేసి మరల తనకుర్చీలో నాసీనుడైనాడు.

మాస్టరు, ఆతనిభార్య ఐక్యకంఠమున "కృష్ణబాబు, మీరు అద్భుతులండీ, గ్రేస్‌కుచీరె, జాకెట్ తీసి[illegible]చ్చారు" అనిరి.

రాధాకృష్ణ నవ్వి ఊరుకొన్నాడు. మా[illegible]భార్య "కృష్ణబాబు, ఈ రోజంతా మిమ్మల్ని ఇక్కడ బందీ చేసివేస్తాము. మీరిక్కడుండిపోవాలి" అంటేమాస్టరు "మిస్టర్‌కృష్ణ, మీరు ఈరోజు మాయింట్లో భోంచేయవలె" అన్నాడు.

కృష్ణ "అందుకేమీ అభ్యంతరముంచను. కాని శాఖా—"

మాస్టరు "అల్లాగే, మీకోసం శాఖాహారాలే చేయించుతాను ఈరోజు." రాధాకృష్ణ కుర్చీనుండి లేచి పళ్ళెరములోని ఒకకార్డు మాస్టరు చేతి కందజేసి "మీ కీసంవత్సరం శుభమౌత్ర

తుంది" అన్నాడు.

మాస్టరు ఉపహారముల నందుకొని ప్రక్కనున్న గ్రేస్‌కిచ్చి "మీరు నన్ను మన్నించాలి. ఉదయం మెయిలు వేళయింది. మీరు రావడం చూసి వచ్చాను. ఇప్పుడే తిరిగి వస్తాను" అని వెళ్ళిపోయినాడు.

మాస్టరుభార్య ఎక్కువ తెలివిగలది కాకపోయినను అవివేకి మాత్రము కాదు. ఆమెకు రాధాకృష్ణ, గ్రేస్ సంభాషణము వినుట ఆనందదాయకముగా నుండును. కాని తానట నున్న వారి యానందమున కంతరాయము కలుగునేమో యని ఏదో పని పేరు చెప్పుకొని వెళ్ళిపోవుట ఆమె కాచారము. ఆమె "కృష్ణబాబు, కొంచెము పనివున్నది. ఇప్పుడే వస్తాను" అని వెళ్ళిపోయినది.

గ్రేస్ "కృష్ణబాబు, మీ చెల్లెల్ని తీసుకురాకపోయినారూ! ఈరోజు ఆమె కూడా ఇక్కడ కాలము గడుపునుగా. అంతే కాదు, ఆమెతో నాకొక అవసరంకూడా కలిగిందిప్పుడు."

రాధాకృష్ణ తనలో తాను నవ్వుకొని "నాకు తెలుసు నా అనవసమేమిటో. ఆంధ్ర దేశములో పెరిగిన ఆడుబిడ్డకు చీరకట్టుకొనడము చేతగాదని కూడా నాకు తెలుసులెండి" అన్నాడు.

శాంతరసము తొల్కాడుచుండు గ్రేస్ నయనద్వయము నొక్కసారిగా కృత్రిమకోప మావరించినది. స్వాభావసిద్ధమగు ఆమె శాంతముయు సౌందర్యమునకే భావపరిస్ఫుటమగు మూలమగు [illegible] వచ్చినది. పిల్లవానివలెనే అల్లరినాడు

అరటి పువ్వువలె కదులుచున్న ఆమె మోవి చూచి రాధా కృష్ణుని యౌవనహృదయ ముద్విగ్నమై పోయినది. తెలివిగల వాడగుటచే నాతడు వెంటనే హృదయమును త్రిప్పుకొన్నాడు. కాని హృదయాంతరమున తనకు తెలియకుండగనే అణిగియున్న యౌవనాశ నేత్రములలో వ్యక్తమగుచుండుట గ్రేస్ ఉత్తేజన చిత్తయైయున్నను గమనింపకపోలేదు. కాని అప్పుడామెహృదయ మాదిక్కుగా లేకపోవుటచే రేకెత్తుచున్న ఆవేశమునకు వశయై "కృష్ణబాబు, మీరల్లా అనడములో ఎక్కువ న్యాయం లేదు. ఇది మాసంఘలోపము. ఈయాంగ్లోఇండియను జాతికి కారకుడైన దూష్లే లోపము. మీకు శక్తియున్న అతన్ని, రోజురోజుకి అణిగి పోతూవున్న మాజాతిని దూషించండి. చూడండి మాజాతి ఎటూ కాకుండాపోయింది. అటు ఆంగ్లే యులలోనూ కలియలేదు. ఇటు భారతీయులలోనూ కలవదు. అంతేకాదు. మాలో వేలుపెట్టిచూపుట కొక్క సుప్రసిద్ధవ్యక్తి బయలుదేరెనేమో చెప్పండి."

కృష్ణ "నిజమే, మిస్ గ్రేస్!"

గ్రేస్ "అంతేకాదు. నామట్టుకు నేనున్నా ననుకోండి. నాజీవిత మెల్లావుంది. చీకటిలోని పావురమువలె ఉంది. చిన్న ప్పటినుంచీ ఆంధ్రదేశములో, ఆంధ్రవాతావరణలో పెరిగినా, ఆంధ్రుల అందమైన ఆచారాలు, ముద్దుల మాటగట్టు ఆంధ్ర భాష, వారిజీవనం తెలియదాయె. అటు యూరోపియనుల ఉత్సాహవంతమైన జీవనశక్తి గ్రహించడానికి వీలులేకపోయింది.

ఇట్టి స్థితిలో చీరె కట్టుకొనడము నాకు చేతకాదని అంటూ రెందుకు మీరు" అని తన ఆవేశమునకు తానే ఆశ్చర్యపడి పక పకనవ్వినది. రాధాకృష్ణ కూడ నవ్వకుండ నూరుకోలేకపోయి నాడు. కృష్ణ నవ్వుచు "నిజమేనండీ! మిస్ గ్రేస్, మీవంటి వ్యక్తులు మీజాతిలో కనిపించడము కష్టము." గ్రేస్ మరల ఆవేశవై అదిగో మీరు మళ్ళీ నాఆవేశానికి దోహద మిస్తు న్నారు. నాలో ఏమున్నదండీగొప్ప. ఈమధ్య బెర్నార్డుషా పుస్తకాలు కొన్ని చదివాను. చూడండి. అతని విప్లవకరమైన భావాలు నిజంగా అతడు రెండుకాళ్ళతుపాను వంటివాడే. ఇంగ్లీషుజాతి నంతా వూపివేస్తున్నాడు. లోపభూయిష్టమైన ఇంగ్లీషుజాతిని సంస్కరించవలె నంటే అటువంటి వాళ్ళే బయలు దేరాలి. లోపాలు ప్రతిజాతిలోను ఉంటవి. కాని మాయాంగ్లో ఇండియను జాతిలో ఎక్కువ. ఈజాతి కేనాడైనా ముక్తి ఉందా అని విచారము కలుగుతుంది. బెర్నార్డుషాలో వందో వంతు ప్రతిభగల ఒక మహాపురుషుడు బయలుదేరినా మాజాతి బాగుపడుతుంది. అంతకూడా అక్కర్లేదు. అటువంటి పుస్తకాలు చదివినా చాలు, ఈసీతాకోకరంగుల వేషాలు, ఈతిండిపోతు తనమూ మాని. కృష్ణబాబు, నాకొక్కొక్కప్పుడు కళ్ళవెంట నీళ్ళు కూడా వస్తవి, మాజాతి నికృష్టావస్థ తలుచుకుంటే. అప్పుడు మాప్లేను శపించుతూ వుంటాను. మాజాతీ మూల కారకులైన ఇంగ్లీషువారిని — " అన్నది.

రాధాకృష్ణ కొంచెముసే వూరుకొని నవ్వుచు "మిస్ గ్రేస్,

మీది చాలా ఆవేశంగల రక్తమండి — అవును గాని ఈ బెర్నార్డుషా ఎవరండీ?" అని మఱింత నవ్వినాడు.

గ్రేస్ మంజులమైన సుస్నిగ్ధ గండఫాలముపై చిఱునగవు వెన్నెలలు తాండవమాడ "ఏమండీ, కృష్ణబాబు, కలకత్తాలో చదువుకొనుచున్న విద్యార్థులు మీరు. అందులోను యమ్. యస్. సి. (M. Sc.) వంటి పెద్దపరీక్షకు చదువుచున్న విద్యావంతులు. ఈశ్వరదాసు యం. ఏ. గారి వంటి విద్యావంతున్ని పుత్రులై వుండి కూడా బెర్నార్డుషా అంటే ఎవరో తెలీక పోవడం చాలా అన్యాయం. అతని గ్రంథ మొకటి ఇస్తాను ఈ సెలవల్లో చదవండి."

హాసోల్లాసితవదనుడగు రాధాకృష్ణ "నిజమే గాని మిస్ గ్రేస్, మీ జాతి అన్ని జాతులకంటె నికృష్టమైన దంటారు. ఆంధ్రు లెటువంటి పతనస్థితిలో ఉన్నారో మీకు తెలియదు. మా జాతి కూడా అటువంటి స్థితిలోనే ఉంది. అంతకన్నా తక్కువ అని కూడా అనవచ్చు."

గ్రేస్ "కృష్ణబాబు, ఏమి అల్లా అంటారు. స్త్రీలలో మీ చెల్లెల్ని ఉదాహరణంగా తీసుకోండి. ఇప్పుడు మద్రాసు క్వీన్ మేరీస్ కాలేజీలో చదువుచున్న మీ చెల్లెలి హృదయము తెలిసికోండి. పురుషుల్లో మీ తండ్రిగారి హృదయము గ్రహించండి. ఏ జాతికైనా హృదయం ముఖ్యం. అదీ కాకుండా మీకు మీ ఆంధ్రుల ఆచారాలలోని అందం, కట్టుబాటులలోని ప్రయోజనం, వేషభాషలలోని మాధుర్యం, ఈవాతావరణలోని

పరిమళం ఎక్కువగా తెలిసికోవడానికి ప్రయత్నిస్తేనేగాని అర్థం కాదు. నేను మాత్రం మా జాతిని తెలిసికోవడానికి ప్రయత్నిస్తూనే వున్నానండి మొదటినుంచీ" అని పకపక నవ్వినది. కృష్ణ "మీ కంతా కలిపి 18 సంవత్సరాలు లేవు –" అని నవ్వినాడు. ఆ నవ్వులో కేవలము అమాయకత్వము పరిస్ఫుటమగుచున్నది. విమలమైన అతని భావార్థము గ్రహించి గ్రేస్ "మీరు ఇంత అమాయకులు. యం. యస్. సి. ఎల్లా చదువుచున్నారండీ!" అన్నది.

*　　*　　*　　*

గ్రేస్ యభిలషితార్థము రాధాకృష్ణ అపరాహ్ణ ప్రారంభ సమయమున చీటి వ్రాసి పంపగా వెంటనే అతని చెల్లెలు సొంత గుర్రపుబండిపై నచటికి వచ్చినది. గ్రేస్ రాధాకృష్ణులు నామె నెదుర్కొనుట కెదురుగా వెళ్ళిరి. గ్రేస్ మందస్మితాననయై "మిస్ సరళాదేవి, ఈ రోజు మీకు క్రొత్తనాటకము చూపించ డానికి పిలిపించాము" అన్నది.

సరళ షేక్‌హాండు చేసి "ఈ నాటకములో నాయకు డెవ్వరై వుంటారు" అని నవ్వినది.

ఆ తేటనవ్వులో నెట్టిభావమును లేదు. విమలహృదయయగు గ్రేస్ క్రొత్తభావమును కల్పించుకొనునట్టి చంచలచిత్త కాదు.

రాధాకృష్ణ పూవులుగాయు నవ్వుతో "చెల్లీ, ఇది నాయకుడు లేని నాటకం. సాధారణంగా గ్రంథకర్త లేదేశము వారైనా ఇంతమట్టుకు పురుషులు లేని స్త్రీల నాటకమూ,

స్త్రీలేని పురుషుల నాటకమూ వ్రాసి వుండలేదు. కాని నేను మాత్రము క్రొత్తరకంగా ఈ రోజున ఒక్క రమణీమణినే కథావస్తువుగా పెట్టి వింత నాటకము వ్రాశాను. ఈ నాటకములో పురుషుడు లేడు" అన్నాడు.

గ్రేస్ "మీ నాటకము ప్రస్తుతం బాగుంటుందేమో కాని భవిష్యత్తులో మాత్రము సరసంగా వుండదేమో అని తోస్తుంది." మునుపటివలె నవ్వుకొన్నారు. గృహాంతరాళమున కేగిన పిదప గ్రేస్ చీర, జాకెట్టు, బ్రూచ్ తీసికొని వచ్చి గభీరభావముతో నా వస్తువులను సరళాదేవి హస్తకమలముల బెట్టినది. అమాయకహృదయ యగు దేవి నవ్వు నాపుకో లేక పోయినది.

సరళ "మిస్ గ్రేస్, నాటకశాలలోకి మిమ్మల్ని చక్కని చుక్కలాగు తయారు చేస్తాను రండి" అని గ్రేస్‌ను లోనికి గొనిపోయినది.

గ్రేస్ మందగమనయై మయూరిపోలిక వెళ్ళుచు "కృష్ణ బాబు, నేను వేషము వేసుకువచ్చిన తర్వాత మీరు నన్ను గురించి టైమ్సు ఆఫ్ ఇండియాలో పొగుడుతూ 'స్టార్' అని వ్రాయాలి సుమండీ" అన్నది. పావుగంటసేపైన పిదప ఇరువు రాంధ్రరమణీమణులు వచ్చి సోఫాపై నాసీనులైరి. సరళాదేవి నవ్వు పట్టలేకుండెను. అందరు ఒకరిని చూచి యొకరు కడుపు లుబ్బునట్లు నవ్వుకొనిరి.

గ్రేస్ అప్పుడు కేవలము రతీదేవి దిగివచ్చినట్టులే యుండెను.

ఆ నిరుపమసౌందర్యావలోకనమున రాధాకృష్ణుని స్థిరచిత్తము కూడ నతనికి తెలియకుండగనే మారిపోయినది. కాని నవ్యలో నాతడాపరివర్తనమును గ్రహింపజాలక పోయినాడు. అకస్మాత్తుగా గ్రేస్ గభీరవదనయై "కృష్ణబాబూ, నా చిరకాల వాంఛను తీర్చినందుకు మిమ్మల్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ విషయమున సాయపడిన మా సరళాదేవికి కూడా కృతజ్ఞత చూపకుండా వుండలేను. కాని కృష్ణబాబు, ఆంధ్రరమణుల చీరెకట్టులోని సౌందర్యం, వారి శాంతమయ నయనములలోని మాధుర్యం, వారి కట్టుబాటులలోని గాంభీర్యం చూచినప్పుడు నాహృదయ ముప్పొంగి పోతూవుంటుంది. నేను చీరెకట్టుకోవాలనీ, ఆంధ్రరమణితో స్నేహము చేయాలనీ ఎన్నాళ్ళనుంచో నా లేతహృదయంలో కోరిక పెరిగి పోతూ వుంది. కృష్ణబాబు, ఆంధ్రుల మధ్యపుట్టి, ఆంధ్రుల పవిత్ర భూమిలో పెరిగి, ఆంధ్రుల సొంతగాలితో జీవించిన నాకు ఇటువంటి కోరిక వుండడములో అబ్బుర మే ముంది? మీ కుటుంబముతో స్నేహము కలియడం మూలమున నాకోరిక నేటికి సఫలమైంది, ఇందుకు మీకెంతో కృతజ్ఞనై వుంటాను" అన్నది.

సరళా రాధాకృష్ణు లొకరినొకరు వీక్షించుకొని అవనత మస్తకు లైనారు. అర్థనిమీలితనేత్రుడైన రాధాకృష్ణు డొక నిముసములోనే శిరస్సు నెత్తి భావగర్భితమై మధురతమమైన మాట యొకటి మనస్ఫార అన్నాడు: "మిస్ గ్రేస్, నిజమే."

సరళ "మిస్ గ్రేస్, మీకిటువంటి ఆదరము, అభిమానము

ఆంధ్రజాతిపై వుండడము నిజముగా మాభాగ్యము" అన్నది.

ఉద్విగ్నచిత్తయగు గ్రేస్ మరింతగభీరముగ "మిస్ సరళా, అంతేకాదు. నే నాంధ్రులలో కలిసిపోయి ఆంధ్రజీవనశక్తిలో మిళితమై పోయి నా జీవితాన్ని ధన్యపరచుకొందా మను కుంటాను — ఫిడేలు తీసుకొస్తాను. మీరు తప్పకుండా ఈరోజు కొన్ని తెలుగుపాటలు పాడాలి" అని వరుగున లోనికి పోయి ఫిడేలు గైకొనివచ్చి సరళాదేవి ఒడిలో నుంచినది. సరళ నూత నోత్తేజముతో "మిస్ గ్రేస్, ఇదివరకల్లా మిమ్మల్ని తప్పించు కొన్నాను. ఆంధ్రుల చీరె ధరించి ఆంధ్రస్త్రీ అయిపోయిన మీకోరిక ఇవాళ తిరస్కరించలే" నని ఫిడేలు సరిచేసికొని వరు సగా త్యాగరాయ, దీక్షిత, శ్యామశాస్త్రి, సుబ్రహ్మణ్య, సదాశివరావుకృతులు అమృతరసము తొలఁకుచున్నట్లు గొంతెత్తి కోకిల మధురస్వరమున నిరుపమేయముగ బాడినది. పాడు చున్నంతసేపును గ్రేస్ ఆనందము భరింపలేక సరళాదేవి తొడపై చరిచి "బేష్, బేష్, బేష్" అనుచున్నది. చీరె ధరిం చిన గ్రేస్వంటి అనుపమాన రూపలలిత సౌందర్యకలిత ప్రక్క నుంటచే గాబోలు నేడు రాధాకృష్ణునికి చెల్లెలి దివ్యసంగీతము లోని అనంతమాధుర్యము పూర్తిగా గోచరించినది. ఆత డానందపులకితు డైపోయి "చెల్లీ, ఏది! సంకల్పమెట్టిదో, మరలా ఒకసారి పాడు" అన్నాడు.

సరళాదేవి నవనవోత్సాహాభరితహృదయయై ఆనందమున అమృతమొలుకునట్లు ఆ కృతి యిట్లు పాడినది.

ప. సంకల్ప మెట్టిదో మనసా. సీ.
సాకేత నిలయుడౌ రామ. సీ.
అ. పంకేరుహా సనాసీనుడైన బ్రహ్మకైన తెలు
సునో తెలియదో. సం.
చ. సర్వజీవాంతఃకరణాసీనుడై సర్వ భూతము
లకు సాక్షియై యుండగా సర్వేశుడౌ
శ్రీవెంకటేశసార్వభౌమ సకలనిష్కామ. సీ.

దీని భావార్థము సరళాదేవి ఇదివరకే గ్రేస్‌కు చెప్పి యుంటచే నాభావము లోని విజ్ఞానము, కంఠస్వరములోని మాధుర్యము నామె యనుభవించి "మిస్ సరళా, అబ్బా మీ తెలుగులో ఎంతమాధుర్య మున్నదీ." అని కొంతదను కూరకుండి "చెప్పగా చెప్పగా మా ఇంగ్లీషు సంగీతములోని నిగ్గే చెప్పాలి" అన్నది. సరళాదేవి చిఱునగవు చేసి "మాపై నున్న అభిమానంవల్ల మీకల్లా తోస్తూవుంది" అన్నది.

గ్రేస్ నవ్వుచు "అవునుగాని కృష్ణబాబు, సంవత్సరాది రోజు ఇంత సంతోషంగా వున్నందుకు సంవత్సరమంతా ఈలాగే వుంటామని స్ఫురిస్తూంది. ఇవాళ సంతోషానికి తోడు బొమ్మ్యారుమెట్ట కేసి మన ముగ్గురమూ షికారు వెళ్ళితే ముత్యానికి పరిమళ మబ్బినట్లుంటుంది" అన్నది.

రాధాకృష్ణ చెల్లెలి కేసి చూచినాడు. అందులకామె అంగీకారమును సూచించుచు తరళనయనములతోడనే జవాబు చెప్పినది. గ్రేస్ మంజులముగ నవ్వుచు "మానం అర్ధాంగీకార

సూచనం" అని ముసలితల్లివద్ద సెలవు గైకొనుటకు లోనికి జనినది.

మాస్టరుభార్య ఆశ్చర్యాన్వితహృదయమై "గ్రేస్, నీ పీరోజు చాలా అందంగా వున్నావు. లేకతీగె అంతా పరిమళవిలసితం అయిన ట్టున్నావు. కృష్ణబాబుకు అభివాదనా లర్పించావా ?" అన్నది. గ్రేస్ ప్రత్యుత్తరముగా తలయూపి "అమ్మా, కృష్ణ బాబు సరళాదేవి నేను ఇవాళ బొమ్మూరుమెట్ట కేసి షికారు వెళ్ళుతాము" అన్నది.

తల్లి అనుమతి ఈయగా మరాళమువలె నడుగు లిడుచు నచటికి వచ్చి "మిస్‌సరళా, వెళ్లుదాము లెండి" అన్నది.

సరళ "నేను రావడానికేమీ అభ్యంతరము లేదు కాని ఈసాయంకాల మొకరింటికి వస్తానని వాగ్దత్తం చేసివున్నాను"

గ్రేస్ "నేనూచేశాను వాగ్దత్తం బొమ్మూరుమెట్టకి, ఇవాళ మిస్ సరళను తీసుకొస్తానని" అని పకపక నవ్వినది.

సరళ "మీ యిద్దరు వెళ్ళండి యీ రోజుకి, క్రొత్త చీరెలో మీరెంతో ముచ్చటగా వున్నారుకూడాను."

గ్రేస్ "నేనొవ్వుకోను. బలవంతాన తీసుకువెళ్తాను" అని యామె లలిత హస్తద్వయమును పట్టుకొని లేవదీసి "కృష్ణ బాబు, రండి వెళుదాము" అన్నది.

రైలుబద్దీల వెంట వెళ్లుచు వా రెన్ని విషయముల గూర్చియో మాటాడుకొన్నారు. సంభాషణావిషయములు తరంగములపై తరంగములవలె నెటనుండి వచ్చుచున్నవో

వారికే తెలియదు.

నడుము నొకరిద్దరు గ్రేస్ పరిచితలు కాన్పించియు నామె నానవాలు పట్టలేకపోయిరి.

పట్టాలు ప్రక్కనున్న ఇనుకతిన్నెపై గూర్చుండిన యిద్దరు బి. యే. విద్యార్థులు "ఒకామె ఈశ్వరదాసుమేస్తారు కూతురు లాగున్నది. ఈ రెండోఆవిడ ఎవరయ్యా నూతనవ్యక్తిలాగుంది? మన ఆంధ్రుల్లోకూడా పికార్లు పద్ధతి పుట్టింది క్రొత్తగాను." అని తమ సంకుచితభావముల నొకరి కొకరు తెలుపుకొనిరి. యూనివర్సిటీ వారి నట్లు తయారు చేసినది. అందు కెవరేమి చేయగలరు?

కాని ఆ యానందమధురమూర్తు లటులనే సంభాషించు కొనుచు బోవుచుండిరి. మెట్ట నధిరోహించిన పిదప నడక అలవాటులేని సరళాదేవి యొకించుక ఆయాసమును సూచించి నది. కుశాగ్రబుద్ధిమతియగు గ్రేస్ అది గ్రహించి "కృష్ణ బాబు, ఈమామిడిచెట్టు చాలా అందంగా ఉంది. రవంతసేపు ఈశిలాఖండం మీద కూర్చుండి మరీవెళుదాము. కాని ఏదీ మీాకలకత్తా ప్రార్థనసమాజంలో పాడేపా టొకటి పాడండి చూద్దాము ఎలావుంటుందో" అన్నది.

సరళ "పాట ఎలావుంటుంది పాటలాగానే వుంటుంది" అన్నది. ఈలోపున రాధాకృష్ణ గొంతు సవరించుకొనుట గ్రేస్ కనిపెట్టి "అవును నిజమే మిస్ సరళపాట పాటలాగానే వుంటుంది. అందులో అబద్ధమేమీాలేదు. ఏది కృష్ణబాబు,

మంచివారు, మిత్రులమాట త్రోసివేయలేరు" అన్నది. సరళాదేవి, గ్రేస్ తలవంచుకొన్నారు, ఆయనపాట ప్రారంభము చేయువరకు. మధురమోహనకంఠమున రాధాకృష్ణ యిట్లు పాడినాడు: ఆనందామృతనమః బ్రహ్మానందామృతనమః

మానస మందిర ధ్యానాభిముఖ సంధాన మహానుభవ త్వదనమః

భర్గనిరామయనమః

మునివర్గాధిపఘననమః

స్వర్గాలయనిరవయవతిశయసుఖ

దుర్గశుభోదయనమః. ఆనంద.

పారనిరాంతకనమః

దుర్ఘోరదోషహారనమః

పారమార్థ విశ్వాభిరామశివ

భూరిలోక విశ్వంభరనమః .ఆనంద.

దేవనిరంజన నమః

సద్భావనదాశ్రయనమః

జీవజగన్మయానందదయామయ

పావనపరబ్రహ్మాత్మకనమః. ఆనంద.

గీతారంభమున పురుషకంఠము వలె నున్నను గొంతెత్తి పాడినపు డాస్వరము సన్ననిదై మాధుర్యమున రమణీకంఠ స్వరమును దలపించినది. సరళాదేవి తన సోదరు డింత మధురముగ పాడగలుగు నని యెన్నడు నెరుగదు. గ్రేస్

ఆశ్చర్యాన్వితయై యాతని వంక రెప్పవాల్చక జూచినది. రాధాకృష్ణ గీతాతాత్పర్యమును విపులముగా గ్రేస్‌కు జెప్పినాడు.

గ్రేస్ ఆవేశపూరితహృదయురాలై "అబ్బా, బ్రాహ్మల భావాలు ఎంతవిశాలమైనవి? — పాపం! మాక్రైస్తవుల లాగు వారికి క్రైస్తుద్వారా దైవాన్ని ప్రార్థించడము తెలియదు లాగుంది. ఏమోనండీ! కృష్ణబాబు, మాక్రైస్తవులు దైవ ప్రార్థన చేసేటప్పుడు క్రైస్తుడు మధ్యవర్తిగా పెట్టుకొని చేయడము నాకు కంటగింపుగా వుంటుంది" అన్నది.

రాధాకృష్ణ "అవును మిస్‌గ్రేస్, మీవంటి విశాలభావాలు కలవారికి క్రైస్తవమతంలో లోపాలు కనిపించడములో ఆశ్చర్యము లేదు. మీకు రాజా రామమోహనరాయి, కేశవచంద్రసేను గ్రంథాలిస్తాను. చదివి మీ అభిప్రాయం చెప్పండి. మీ వంటి విశాలహృదయానికి ఈ మతం సంతోషప్రదంగా వుంటుందని తలుస్తాను." అన్నాడు.

గ్రేస్ "ఇవ్వండి తప్పకుండా చదువుతాను. మన మిస్ సరళ చదివిందేమో ఆ పుస్తకాలు."

సరళ నవ్వుచు "మా నాన్నగారు నేను స్కూలుఫైనలు చదువుతున్నపుడే అవి చదివి వినిపించారు నాకు. కాని స్కూలు వాళ్ళు మాత్రం చెప్పలేదు సుమండీ. మా స్కూలం పెద్ద మనుష్యులకు ఇటువంటి గ్రంథాలు గిట్టవు."

కొంతసే పచట కూరుచుండి మెల్లగా మెట్ల చివరభాగము

నకు వెళ్ళి వారు ముగ్గురు నిలుచున్నారు. గభీరమైన భావ ములనుదయింపజేయుచు ఉత్తమహృదయులకు నుత్తమోత్తమ పాఠములను గరపు ఆ మనోహర ప్రకృతిదృశ్యమును గాంచి వారు ఒక్కింతసేపు నిశ్శబ్దులై నిలువబడిపోయినారు.

గ్రేస్ "కృష్ణబాబు, చూశారా? ఏమి కనిపిస్తూంది?"

కృష్ణ నవ్వుచు "చెట్లూ చేమలూ కనిపిస్తున్నవి."

గ్రేస్ మరింత నవ్వి "చేమలూ కాదు. చీమలూ కాదు. కనిపించేవి — (ఉప్పొంగుచున్న భావావేశము నణచుకోలేక గభీరవదనమున) అదికాదు కృష్ణబాబు కనిపించేది. నేను చెప్తా తాను వినండి. ఈ ఎత్తైనకొండమీద నుంచి చూస్తూన్న విశాల దృష్టికి కనిపించేది ఆనందలీలాక్షేత్రం. లోకమంతా ఒక ఆనందపుతునుక అని మీకు స్ఫురించడములా? ఈ విశాలదృష్టికి చిన్నిచిన్ని భేదాలేమీ వుండవు. భేదాలు సంకుచితదృష్టికే. ఆ కనిపించేది ఆనందలీలాక్షేత్రం గాదా మిస్ సరళ!" అన్నది.

గ్రేస్ శాంతమయసౌందర్యనయనములపై సరళాదేవి గభీర భావతరంగితములగు దృక్కుల బరపి మెల్లగా "అవును మిస్ గ్రేస్" అన్నది. కృష్ణ "నిజమే మిస్" అన్నాడు.

నాడు శుక్లపక్ష ఏకాదశి. సూర్యాస్తమాన, సుధాకరోదయ మధ్యస్థ సమయ మది. అడుగులలో నడుగు వేసికొనుచు మెల్లగా ముగ్గురు పర్వతావరోహము చేయుచుండిరి. గ్రేస్ తనలో తాను అతిమెల్లగా స్వరముం బాడుచున్నది. సమయము దొరికినదని సరళాదేవి "ఒక్క ఇంగ్లీషుపాట పాడు" మన్నది,

గేనును జూచి.

గ్రేస్ ఇట్లు ప్రత్యుత్తర మిచ్చినది, "మీరిద్దరూ నాకోర్కె తీర్చారు. నేను మాత్రం మీ కోర్కె తీర్చలేనందుకు విచారంగా వుంది. నిజము చెప్పుచున్నాను. మిస్ సరళా, మా ఇంగ్లీషు సంగీతం నాకంతగా నచ్చదు. మీ అనుమతి తీసుకొని మీవద్ద తెనుగుసంగీతం నేర్చుకోవాలని వుంది."

సరళ "అల్లాగే నేర్చుకుందురుగాని. మీరు మాత్రము యాంగ్లో ఇండియనులలో పుట్టవలసిన వారు కాదు సుమండీ! ఆంధ్రుల్లో పుట్టదగ్గవారు." అని నవ్వినది.

గ్రేస్ నవ్వుచు "ఇవు డైతేనేమి? మిస్ సరళ" అన్నది.

ఇటులే మాటాడుకొనుచుండగా బొమ్మూ్మరువల్లె సమీపించినది.

సరళాదేవి గ్రేస్ భుజముపై జేయివైచి ఆమె నావుజేసి చుబుకమునుబట్టుకొని "మిస్ గ్రేస్, మీరెప్పుడైనా తెనుగుపల్లెటూరు చూశారా?" అన్నది.

గ్రేస్ "చూడలేదు."

సరళ "అయితే మీ కొక ప్రార్థన వుంది. ఎల్లుండి అన్నయ్యా నేను మా మేనత్తవూరు అమలాపురం వెళ్ళవలసిన రోజు. మీరు కూడా వస్తే చాలా అందంగా వుంటుంది. నేను మీ తండ్రిగారితో చెపుతాను. పల్లెటూరు జీవితం మీకు రుచి చూపిస్తాను. తప్పకుండా రావాలి."

గ్రేస్ ఆనందహృదయమున "అంతకన్నా ఏమిటి మిస్ సరళ.

గ్రామ్యుల జీవనం లోతుగా తెలిసికోవాలని నాకు చిరకాలం నుంచి కోరిక వుంది. అవ్వాళ్లో కారము ఎక్కువ వేసిన కూరలు మాత్రం పెట్టవద్దు. ఆ షరతు మీదనైతే వస్తాను'' అన్నది.

ముగ్గురు నవ్వుకొన్నారు.

౨

ఆనాడు మధ్యాహ్నము గ్రేస్ ఈశ్వరదాసుగారి యింటిలో భోజనము చేసినది. ఆకసపురంగు చీరె సింగారించుకొని, చాక్లెట్ రంగు జాకెట్టు ధరించుకొనిన గ్రేస్, సరళాదేవి, రాధాకృష్ణ పడవదగ్గరకు ౧ గంటకుబయలు దేరినారు. అదివరకే యేర్పాటు చేయబడిన రెండు గదులలో నొకదాని యందు పెట్టెలు పరుపులు, సామగ్రియునుంచి రెండవగదిలో ముగ్గురు నాసీనులైరి. పడవ మెల్లగా కదిలినది. అంతకుముందు కొంత గ్రేస్‌కు చదివి వినిపించిన రవీంద్రుని హోం అండు ది వరల్డు అను పుస్తకము నుత్సాహముతో రాధాకృష్ణ విప్పినాడు. గ్రేస్ ఉద్విగ్నచిత్తముతో "కృష్ణబాబు, ఆరవప్రకరణం నుంచి చదవండి. ఇతివృత్తం చాలా బాగుంది. ఠాకూరు నిరుపమానమైన కవిలాగున్నాడే. అంతాసైకాలజీయే'' అన్నది.

గ్రేస్, సరళాదేవి ఆత్రముతో వినుచున్నారు. కాని నడుమ నడుమ గభీరనదీప్రవాహము తన దివ్యసంగీతమును వినిపించుటకు గ్రేస్‌ను సరళాదేవిని ఆహ్వానించు చున్నది. అప్పుడు

వృద్ధగాతమిాగభీరతరంగమాలికా మధురతమమంజులస్వనము నుండి ఒక యపూర్వవాణి "లోకము ప్రేమమయము, ఆనంద మయము" అనుట వారి కుత్సాహజనకముగ శ్రుతిపర్వమైనది. ఉత్సాహోద్వేగముతో గ్రేస్ "కృష్ణబాబు, మానవనిర్మిత మైన ఆనందదాయకవస్తువుల కంటే పరమేశ్వరకల్పితము లెక్కు-వవి కాదా! అటు చూడండి. సూర్యకిరణాలతో ఆడుకుంటూ మధురస్వరముతో దివ్యసంగీతం పాడుతూవున్న అలలు చూడండి. ఎంత ఆనందంగా ఉంది ఇవాళ. ప్రకృతిలో దేవుడు ఎంత సౌందర్యము పెట్టాడు" అన్నది.

సరళ "అవును మిస్ గ్రేస్, అంతేకాదు. ఆదినుండి సృష్టి అందము దినదినము పెరిగిపోతూవుంది. ప్రకృతి తనఒడిలోకి రమ్మని మానవుల్ని ఆహ్వానించుతుంది. కాని వీళ్ళువినడము లేదు. వినలేక పోతున్నారు."

కొంతసేపు ముగ్వురు కలిసి యాసౌందర్యానందము ననుభ వించినారు. ఆమాధుర్యమును గ్రోలినారు. గభీరభావగర్భితనదీ ప్రవాహములోని అనంతమైన పరమార్థము వారి చిఱుత హృదయములను సజ్జాతూగించినది.

పడవ మందగమనముతో వెళ్లుచునే యున్నది. మరల గ్రేస్‌కోరికపై గ్రంథపఠనము మొదలుపెట్టినాడు రాధాకృష్ణ నిరాటంకముగా చదువు సాగిపోవుచున్నది. ఆత్రముతో గ్రేస్, సరళాదేవియు నాలకించుచున్నారు. మధ్యమధ్య కొంతసేపు గ్రంథపఠన మాపుజేయుచు మరల చదువుచు కాలము గడుపు

-చుండిరి. సాయంకాలము నాలుగుగంటలకు సరళాదేవి స్టవుపై ఫలహారము తయారుచేసినది. గ్రేస్ కాఫీ స్వయముగా గాచినది. ముచ్చురు సల్లాపములతో నారగించిరి. మరల గ్రంథపఠనము. ఇటులే ఆనందోత్సాహసంభాషణముల మధ్యకాలము గడిచినది. ఎనిమిదిగంటలకు ముచ్చురు నేక పంక్తిని గూరుచుండి భోజనము చేసినారు. మరల పుస్తకమును చదివినాడు రాధాకృష్ణ.

వెన్నెల వచ్చినతరువాత వారు పడవపై భాగమునకు వెళ్ళి గూరుచుండిరి. గ్రంథపఠనము జరుగుచున్న కాలమున నొక్కొక్కప్పుడు గ్రేస్ పరాయత్తచిత్త యగు చుండెను. సరళాదేవి యీసంగతి గ్రహించకపోలేదు. ఏయే ఘట్టములలో గ్రేస్ పరధ్యాన యగుచుండెనో ఈమె గ్రహించినది. గ్రేస్ అకస్మాత్తుగా "కృష్ణబాబు, నామనసు బాగుండలేదు; ఆపుచేయండి" అని సరళాదేవిని జూచి "మిస్ సరళా, ఈవెన్నెల్లో ఈపడవమీాద సంగీతం పాడితే గాలిదేవుడు ఎంత సంతోషంతో దానిని తనపక్షాలమీాద మోసుకొని వెళ్తాడో తెలియునా? ఏది ఫిడేలుతీయండి" అన్నది.

ఎట్టి కారణము చెప్పినను గ్రేస్ ఊరుకొనదని సరళాదేవికి బాగుగా తెలియును. "అట్లయితే, లోనికి వెళ్ళుదాము పదండి" అన్నది.

ముచ్చురును గదిలోనికి వెళ్ళినారు. రాధాకృష్ణ చేతి గడియారము జూచి "పదైంది" అన్నాడు.

గ్రేస్ "ఒక్క అరగంట నేను పాడినతర్వాత నిద్రపోదాము. ఏది మిస్ సరళ, సంకల్ప మెట్టిదో పాడండి."

సరళాదేవి నవ్వుచు గొంతెత్తి అమృత ముట్టిపడు నట్లు మంజులస్వరమున మధురముగ బాడినది. భావార్థమెరిగిన గ్రేస్ చిత్త మా పవిత్రగాతమీతోయములమీద నుండగనే చలించిపోయినది. చిత్తవిభ్రమము పరులకు తెలియకుండ నామె ముఖమును శూన్యాకాశమునకు ద్రిప్పి, ఆదివ్యసంగీతము నాలకించుచున్నది. రాధాకృష్ణునిహృదయవీణాతంతువులు గీతమును ఎవరికి వినిపించకుండ లోలోన నాలపించినవి. గానసందేశమున రాధాకృష్ణ ఆశ్చర్యము చెందినాడు. తనకు తెలియకుండగనే తన హృదయకుహరమున నేదియో దివ్యశక్తి నిరంతరముగ పెరిగి పోవుచున్న ట్లప్పు డాతనికి దోచినది. సరళాదేవి ఆ ముఖచిహ్నములను గ్రహించినది. సంగీతానంతరము పెట్టె లున్న గదిలో పరుపు వేసికొని రాధాకృష్ణయును, రెండవగదిలో నొకే శయ్యపై గ్రేస్, సరళాదేవియు పరుండినారు. గ్రేస్ నిర్మలచిత్తముతో సరళాదేవి నవనీత సదృశ కోమల కరపల్లవమును ముద్దిడి "మిస్, మీకంఠంలో ఇంత మాధుర్యం ఎలా వచ్చిందో చెప్పరూ?" అన్నది.

సరళ నవ్వి "మీముఖానికి ఇంత అందము ఎక్కడినుంచి తెచ్చిపెట్టుకున్నారో చెప్పకూడదా?" అన్నది.

ఇరువురును పకపక నవ్వుకొన్నారు.

సూర్యోదయ మైనది. ఆ మనోహర ప్రభాతసమయమున

అరుణప్రభలు గ్రేస్, సరళాదేవి వదనకమలములపై ప్రసరించి వింత సోయగమును దెచ్చిపెట్టినవి. గ్రేస్ మేల్కొని ఉషా దేవిని సందర్శించి "మిస్ సరళ, ప్రపంచం పుట్టాక ఎన్ని సూర్యోదయాలైనవో నాకు తెలియదు కాని ఇవాళ సూర్యోదయంమాత్రం అన్నిటికన్నా ఎక్కువ అందముగా వుందని మాత్రం నిర్భయంగా చెప్పతాను" అన్నది. సరళా దేవి ఆమె అమాయకపు హృదయమును గాంచి తనలో దాను నవ్వుకొన్నది. రాధాకృష్ణ మేల్కొని నాటి పవిత్రసమయమున యౌవనాశాహృదయము లోచనములలో పరిస్ఫుట మగు చుండ మిస్ గ్రేస్‌ను దిలకించినాడు. గ్రేస్ కూడా నాతనివంక గభీరభావమున జూచి తల వంచినది. ప్రక్కనున్న పక్షులు కిలకిల మన్నవి. గ్రేస్ భావగర్భితదృక్కుల వలెనే విహంగ నిస్వనము కూడ రాధాకృష్ణుని మంజుల హృదయ వీణను మీటినవి. వీణాతంతువులు కలకలమని కదిలిపోయినవి.

ఇంక కొంతసేపటికి పడవ అమలాపురము చేరినది. సామానులు కూలివాండ్రు దింపినారు. రాధాకృష్ణ చేయి అందించి సరళాదేవిని ముందు దింపెను. తరువాత గ్రేస్ కోమలకరపల్లవమును బట్టుకొని ఆమె దిగుటకు సాయము జేసినాడు. అప్పు డాతని లేతహృదయము వణికి పోయినది. ఆంధ్రయువతి యైపోయిన గ్రేస్ రాధాకృష్ణునిలో ఆ హృదయ పరివర్తనము గ్రహింపక పోలేదు.

*　*　*　*

ఇప్పుడు వీరు వెళ్లినది ఈశ్వరదాసుగారి చెల్లెలు ఇంటికి. ఆమె యా యూరులోని సుప్రసిద్ధన్యాయవాది భార్య. ఆ సతీపతులు ఇరువురును విశాలభావహృదయులే యగుటచే గ్రేస్ రాక కమందానంద మొందినారు. తెలుగుపల్లెటూళ్లు గాంచ గ్రేస్ కుతూహల పడుచున్నట్లు వారికి తెలిసి యామె యభిలషితార్థము చక్కని యేర్పాటుల జేసిరి. మరుసటిరోజున న్యాయవ్యాది, అతని భార్య, గ్రేస్, సరళాదేవి, రాధాకృష్ణ— అందరును గలిసి బెండమూరులంక వెళ్ళినారు. ఆ కొబ్బరి తోటలు మామిడిచెట్లు గ్రేస్‌ను బాగుగా ఆకర్షించినవి. ఆ వాతావరణమే మధురముగ దోచిన దా లేతహృదయమునకు. గభీరసముద్రతరంగధ్వని యామెను నవళను జేసివైచినది. మరునాడు బోడసకుర్రు వెళ్లి ఫలభరితమై నేత్రపర్వముగ నున్న వృక్షరాజములు, వరిపొలములు, ఆడంబర రహిత జీవనులైయున్న గ్రామవాసుల జీవితములోని లోతు, గాంచి ఆనందించినారు. రెడ్డిగారి బంగాళాలో న్యాయవాది, అతని భార్య యుండగా గ్రేస్, రాధాకృష్ణ, సరళాదేవి చుట్టునున్న తోట జూడనేగిరి.

గ్రేస్ "ఇక్కడ చాలా అందంగావుంది. ఇక్కడివారు నిజంగా అదృష్టవంతులే."

సరళ "అదృష్టవంతులే అంటే లాభం లేదు. మీరు తెలుగు బాగా నేర్చుకొని ఆడంబర మెరుగని ఆంధ్రుల జీవితంలోని అందము అద్దములో చూపించినట్లు అనుపమాన

మైన నవల వ్రాయాలి. అప్పుడుగాని మీమాటల వల్ల ప్రయోజనం వుండదు."

కృష్ణ "నిజమే. ఆంధ్రుల సాంసారిక జీవితంలోని మాధుర్యము, గ్రామజీవనంలోని లోతు తెలిపే గ్రంథాలు మనకు లేవు. గ్రేస్ వంటి కుశాగ్రబుద్ధిమతి అటువంటి గ్రంథాలు వ్రాస్తే ఆంధ్రభాష ధన్యమవుతుంది."

గ్రేస్ "అంత అదృష్టము కూడాను. మీకేదో నాపై గల వాత్సల్యంచేత అల్లా అంటున్నారు కాని."

మరునాడు వారందరు రావులపాలెము వెళ్ళినారు. వీరు బసచేసిన యింటి యజమాని ఆరోజు వారి నచటనే ఆపుజేసి వైచినాడు. పొలములు చూచి వచ్చి మెల్లగా యిల్లు చేరుకొనునప్పటికి సాయంకాల మైనది.

లోపల గూరుచుండి న్యాయవాది వెంట తెచ్చుకొనిన లాపుస్తకముల నవలోకించుచున్నాడు. అతనిభార్య ప్రక్క గూరుచుండి యేదో గ్రంథము పఠించు చున్నది. గ్రేస్, రాధా కృష్ణ, సరళాదేవి వీధియరుగుపై నాసీనులై సంభాషణలోనికి దిగిరి. అంతలో జూచు చుండగనే అంబరవీధి మేఘావృత మైనది. ఒకవైపున ఎర్రనిరంగు గలిగిన సూర్యనారాయణుడు అస్తాచలమున గ్రుంకుచున్నాడు. ఆ యానందోత్సాహభరితులకు యెదుట నొక పెద్దచెరు వున్నది. ఆ చెరువుచుట్టును కొబ్బరిచెట్లు, చిన్నయిండ్లు, మండువాభవంతులు నున్నవి. నీలాకాశము విమలసలిలమున ప్రతిబింబించుచున్నది. ఆ విన్నా

ణము కాంచి గ్రేస్ దిగ్భ్రమమై పోయినది.

గ్రేస్ "మిస్ సరళా, అబ్బా ఈ దృశ్యం ఎంత మనో హారంగా వుందో చూడండి. మనుష్యులు కట్టుకున్న పట్టణా లలో ఈ మనోహరత్వం రమ్మంటే ఎలా వస్తుంది. ఇటువంటి గ్రామాలు ఆధారంచేసుకొని నవలవ్రాస్తే ఎంతబాగుంటుంది!"

సరళాదేవి నవ్వుచు "మీ వంటివారు వ్రాస్తే చాలా బాగుంటుంది" అన్నది.

గ్రేస "నా కంతశక్తి లేదేమో అని సందేహం."

కృష్ణ "ఎవరిశక్తి వారికి తెలియదు లెండి!"

గ్రేస్ గభీరమైన ప్రేమమయదృక్కులతో నిసుమంత కోప మును సూచించుచు "అవును లెండి" అన్నది.

సరళాదేవి మౌనము దాల్చినది. కొంతసేపైన తరువాత సరళాదేవి నవ్వుచు "మిస్ గ్రేస్, మీ బుద్ధి కుశాగ్రమైంది — ఇటువంటివారు కాని ఈదృశ్యంలోని గభీరభావాలు, మాధుర్య రసం గ్రహించలేరు" అన్నది.

గ్రేస్ గ్రామవాసుల జీవితము సూక్ష్మబుద్ధితో నానందించి నది. మరునాడు వారమలాపురము వచ్చి అచట రెండురోజు లున్నారు. ప్రయాణ మగుచున్నప్పుడు న్యాయవాదిభార్య గ్రేస్‌కు చక్కని చీరె, జాకెట్టు ఇచ్చి బహూకరించినది. వారు ప్రయాణసన్నాహులై ముక్తేశ్వరము, కోటిపల్లి, ద్రాక్షారామ జూచుకొనుచు కాకినాడ చేరినారు. ఆ యాంధ్ర వాతావరణ ములో గ్రేస్‌కు అనంతమైన సౌందర్యము, మాధుర్యము గోచ

రించినవి. ఈ దృశ్యముల మూలమున ఆంధ్రాభిమాన మామె లేత హృదయమున ఇనుమడించిపోయినది. ఇపుడు గ్రేస్ సరళా దేవితో తప్ప రాధాకృష్ణతో నంత చనువుగా మాటాడుట లేదు. రాధాకృష్ణ అందులకు కారణము "ప్రస్తుతోత్సాహ మేమొ. ఈ వూళ్ళు చూడడమువల్ల ఉప్పొంగిపోయిన ఆనం దము వల్లనేమొ" అనుకొన్నాడు. కాని నిజకారణము మాత్రము సరళాదేవి బాగుగా యెరుగును. ఆ చూపులలోని పరమార్థము ఆమె కిది వరకే బోధపడిపోయినది. అందుచేతనే ఆమె కోటిపల్లి దగ్గర గ్రేస్‌ను జూచి "మిస్ గ్రేస్, చీరె కట్టు కొన్న తర్వాత అందముతోపాటు యురేషియన్ హృదయము కూడా మారిపోయినట్లుంది" అన్నది. గ్రేస్ నవ్వి యూరకున్నది.

3

నాలుగుమాసములు గడిచినవి. అలంకారములు లేక శూన్యమై యున్న నొక గదిలో నాతడు భక్తహృదయమున నిట్లు అంజలి నర్పించుచున్నాడు: "తండ్రీ! మేము నీబిడ్డలము. అమాయ కులము. నీకృపాకటాక్షముపై మాస్థితి ఆధారపడి వుంది. నీదయామృతముపై మేము ఆశపెట్టుకొని వున్నాము. నీవే మాదిక్కని హృదయపూర్వకంగా నమ్మివున్నాము. మాఆశ లను నెరవేర్చి మమ్మల్ని ఉద్ధరించు. మా హృదయాలలో నీపై భక్తి రెట్టింపు బలముతో దృఢపడేట్టు ఆశీర్వదించు.

నీదివ్యసన్నిధానము మే మనుభవించేట్టు మాకు ధృడతరమైన భక్తియివ్వు. సర్వదా నీదివ్య మంగళమూర్తిని, నీప్రేమా నందైకస్వరూపాన్ని, శాంతధామాన్ని, అనుభవించగలశక్తి ప్రసాదించు. తండ్రీ, నీదయకోసము తపించుపోవుచున్న ఈ శూన్యహృదయంలో నీ దివ్యజ్యోతి వెలిగించు. దినదినము నీ ఆశీర్వాదబలమువల్ల పైమెట్టు ఎక్కవలసిన నేను తగిన బలము లేకపోవడము చేత అణిగిపోతున్నా నేమో అని భయము వేస్తూంది. చిన్నచిన్న భేదాలు, సుఖదుఃఖాలు అనే తారతమ్యము, అహంభావము పూర్తిగా నన్నింకా వదలకుండా వున్నవి. రోజు రోజుకి పై మెట్టు ఎక్కవలసిన ఈచిన్ని హృదయము ఇంకా పవిత్రవంతము కాలేకపోతూంది. ఇందులకు నీ ఆశీర్వాదబలము లేకపోతే నేను అధఃపాతాళానికి అణిగి పోతానేమో నని భయము వేస్తుంది. తండ్రీ, ఈచిన్ని కుమారునిపై నీకింకా దయ కలగలేదా? ఇంకా నే నెన్నాళ్ళు ఈవిధంగా చిన్నిచిన్ని భేదాలతో అంధకారంలో వుండాలి. తండ్రీ! ఎల్లప్పుడు నీసన్నిధానములో వుంచుకొని, నీకృపా కటాక్షము ప్రసాదించి ఈ క్రుంగిపోయిన హృదయాన్ని లేవదీయరాదా! ప్రభూ! మిగిలివున్న అహంభావాన్ని అంత రింప జేయుము. భిన్నత్వభావము అడుగంట అణిచివేయుము. ఒక నీ స్వరూపము మాత్రమే సర్వము నిండి వున్నట్లు తెలిసికోవడానికి ఒక నీప్రకాశమే సర్వవస్తువులందు ప్రకాశించు చున్నట్లు గ్రహించడానికి, తగిన బలమునిచ్చి సర్వదా నీసౌందర్య

మూర్తినే అనుభవించేట్లు ఆశీర్వదించు. తండ్రీ, అంతకంటె ఈ తప్తహృదయానికి కావలసిం దింకేముంటుంది. అప్పుడే నా జీవితం ధన్య మవుతుంది. నీ దివ్యజ్యోతి నాలోకూడా వెలుగు తుంది. నీదివ్యస్వరూపము, ప్రతినిమిషము, ప్రతిఅణువునందు విలోకించి ఆనందిస్తూ వుంటాను. ఓం శాంతిశ్శాంతిః శ్శాంతిః"

ప్రార్థనామందిరమున ఈశ్వరదాసు ఒక్కడే కూరుచుండి పరమేశ్వరసన్నిధానమున నీవిధముగ చిన్ని బాలునివలె కించిన్మాత్రమైన అహంభావము లేక అంజలి ఘటించి ప్రార్థన జేసినాడు. ప్రతిదినము నుదయమున కుటుంబమంతయు నొకరి తర్వాత నొకరు వెళ్ళి ఈ చిన్ని మందిరమున పరమేశ్వరప్రార్థన చేయుట ఆచారము. నేడు ఈశ్వరదాసు మందిరము వెలుపలికి వచ్చునప్పుడు నూతనోత్తేజముతో, తేలికయయిన హృదయ ముతో వచ్చినాడు. ఇప్పు డాతని హృదయముపై నున్న నేదియో బరువైన పదార్థము తొలగిపోయినట్లున్నది. ఇంతలో సేవకు డుత్తరము తీసుకొని వచ్చి ఈశ్వరదాసు చేతిలో నుంచినాడు. లేఖ:

శ్రీ నాన్నగారి సముఖమునకు మీ ప్రియపుత్రు డనేక నమస్కారము లతో బంపిన విజ్ఞాపనము.

పరమేశ్వరుని ఆశీస్సు బలము వల్లను, మీ యాశీర్వాదము వల్లను నేను కులాసాగా నున్నాను. పరీక్షకు కష్టపడి చదివి నాను. అట్లన్నచో దివారాత్రములు నేకదీక్షతో నారోగ్యము నకు భంగము కలుగునట్లు చదివినానని మీరు తలంపవద్దు

మీయాజ్ఞానుసారము శరీరారోగ్యము, మానసికారోగ్యము చెడకుండ బహుజాగ్రత్తతో చదివినాను. పరీక్షలు నిన్నటితో నైనవి. ఈసరికి కలకత్తా విడువవలసిన సమయమైనను నొకా నొక కారణాంతరముచే నట్లు చేయజాలకపోతిని. తన్మూలమున పరీక్ష లయినవెంటనే బయలుదేరి రావలెనను మీయాజ్ఞ నుల్లంఘించినందుకు విచారించకుండ నుండజాలను.

వికసనసమయము వచ్చునప్పటికి గులాబిపువ్వు ప్రఫుల్లము కాకుండ నుండజాల దను సంగతి మీకు తెలియనిది కాదు. అటులనే నాహృదయకుసుమము కూడ నేడు వికసించి యొక జీవి నాకర్షించినది. ఎన్నినాళ్లనుండియో హృదయాకాశము నందు మాకు తెలియకుండగనే ప్రకాశమానమైయున్న ఆ దివ్య జ్యోతిని మేము నేడు కనుగొన గలిగినాము. ఆ మనోహర సంగీతమును నే డాలింప గలిగినాము. నేడుగదా మాజీవితములు ధన్యమైన వని ఇర్వురము నొక్కసారి యానందపడితిమి. ప్రేమైక జీవనములోని మాధుర్యము నొక్కసారిగా అనుభవించుట తెలిసికొంటిమి. ఇతరులకు తెలియకుండగనే పరస్పర బద్ధహృదయులమై ఆ యానందములోని మాధుర్యమును, ఆప్రేమలోని నిగ్గును నిరంతరాయముగ ననుభవించుచున్నాము. ఈ మా ఆనందమునకు దోహదముచేసి పుణ్యము కట్టుకోవలసిన వారు మీరు. మా యిర్వురి జీవితములును ధన్యతమ మొనర్ప గలవారు మీరు తప్ప నింకొకరు లేరు. అందుచే విశాల హృదయులు భక్తులు నగు మీరు మా యాశాలత త్రెంపి

వేయ జాలరని నమ్ముచు మీ యనుమతి కొరకు కాత్రముతో నెదురు చూచుచున్నాము.

గ్రేస్ యెడ నాకున్న ప్రేమాతిశయమును నేనామెకు వెల్లడించుటకు ధైర్యము చాలక ఎన్నాళ్లనుండియో మౌనము దాల్చి యున్నాను. నా హృదయపరివర్తనము నామె కనిపెట్టక పోలేదు. మొన్నటిదినము సుదినము. ఆరోజునే ఆమె తన హృదయస్థ రహస్యభావమును దెలుపుచు తన అర్పిత హృదయము నేనానందముతో నంగీకరించవలసినదిగా నుత్తరము వ్రాసినది. నా హృదయము ఒక్కసారిగా ప్రణయప్రభంజనాహతికి కదిలి పోయినది. నా కంత ధైర్య మున్నదా? అనుకొన్నాను. కాని ఆలోచించగా మీవంటి యుత్తమ జనకుని పుత్రుడనై యుండి అట్లధైర్యపడుటకు కారణము లేదని ధైర్యము చిక్కబట్టుకొన్నాను. నే నింకను గ్రేస్‌కు నా యనుమతి తెలిపి యుండలేదు. మీ యాజ్ఞ గైకొని యామె కుత్తరము వ్రాయవలెనని యెంచినాను.

మీవంటి భక్తహృదయులకు విశాలభావవిరాజిత మానసులకు నేను క్రొత్తగా చెప్పవలసినదేమియు నుండదు. ఆమె యాంగ్లోయిండియను, నే నాంధ్రుడ నని మీరు తలంపవద్దు. ఈ భేదము లన్నియు మానవులు మానసిక దౌర్బల్యము వలన తెచ్చి పెట్టుకొనినవే కాని పరమేశ్వరుని విశాలదృష్టిలోను, ప్రేమ సామ్రాజ్యమునను నిట్టి భేదములు లేవని నే నిపుడు క్రొత్తగా మీకు చెప్పవలసిన యవసర ముండదు.

కనుక మీ యంగీకారము తెలుప వినయవినమితుడనై వేడుచున్నాను. మా చెల్లెలు సరళాదేవిని కూడ నాలోచించ ప్రార్థించెదను. చిత్తగించవలెను.

కలకత్తా రాధాకృష్ణ

అప్పుడే పరమేశ్వరప్రార్థనమున భేదభావ మడంచి ఏకత్వ భావము కలిగింపుమని కోరిన ఈశ్వరదాసునకు ఈ యుత్తరము నిరవధికానందము గూర్చినది. లేఖాపఠన మైన వెంటనే యాతడు మరల ప్రార్థనామందిరమును ప్రవేశించి "పరమేశ్వరా! ఈనవదంపతులను, నీ వాశీర్వదించి వారిని దృఢతర ప్రేమాను బంధమున నైక్య మొనర్పుము. నేడే నీసన్నిధానమున వారు దంపతులై పోయినారు. వారి జీవితముల నొక్కటిగా జేసి పైచి ప్రేమలహరిలో తేల్చివేయుము. నీ యాశీర్వాదమే వారి రాగబంధము" అని ప్రార్థించినాడు.

ఎదో తెలియని మధురవాణి "శుభమస్తు" అన్న ట్లాతనికి శ్రుతిపర్వమైనది. అప్పు డాతని కనుకొలంకులనుండి యాతనికి తెలియకనే ఒకటి రెండు ఆనందబాష్పబిందువులు జారిపడినవి.

## ౪

ప్రేమనుమాష్టరు భవనమును చుట్టియున్న మనోహరోద్యా నమున నొక బొగడచెట్టు క్రింద రెండు పేముబెత్తపు కుర్చీలలో రాధాకృష్ణ గ్రేస్ ఉపవిష్టులై యున్నారు. మందమైన సూర్య

కిరణములు లేతయాకుల నడుమనుండి వచ్చి గ్రేస్ ముంగురులపై తాండవమాడుచున్నవి. రాధాకృష్ణ సూర్యదీప్తిలో మెరిసి పోవుచున్న ఆముచ్చటైన ముంగురుల నవలోకించుచు "గ్రేస్, బ్రాహ్మసమాజ మంటే ఆధ్యాత్మి కోపాసకులకూటమి అన్న మాట. ఈసమాజమునకు దైవసాన్నిధ్య మనుభవించుటే ముఖ్యం. కడమ నిబంధనలన్నీ దాని ననుసరించే వున్నవి."

గ్రేస్ "అయినను బ్రాహ్మసమాజ మొక ప్రత్యేక మత మన్నమాటయే కదూ!"

కృష్ణ "గ్రేస్, అల్లాకాదు. ఇది ప్రత్యేకమని దీన్ని బాగా తరచని వాళ్లు మాత్రమే భ్రమపడుతున్నారు. ఇది ప్రత్యేక మత మెలా అవుతుంది! క్రిష్టియన్ అయినా మహ్మదీయుడైనా హిందువైనా విశాల భావాలు కలిగివుంటే ఆనందముతో స్వాగతమిస్తూన్నప్పుడు. క్రిష్టియన్ తాను క్రిష్టియన్‌గానే వుండవచ్చు; మహ్మదీయుడు మహ్మదీయుడుగానే వుండవచ్చు; విశాలమైన భావాలు కలిగియుండి ఉపాసనాశీలుడైతే అతడు బ్రాహ్మకూడా అవుతాడు. ఇదే దీంట్లోవున్న గొప్పతనం. అటువంటి సున్నితమైన భావాలతోనే దేవేంద్రనాథ్ మహర్షి, కేశవబాబు దీన్ని పునరుద్ధరించారు. ఇంతకు బ్రాహ్మసమాజ మంటే ఉపాసకులకూటమి అన్నమాట. ఇది ప్రత్యేకమతము కూడాకాదు."

గ్రేస్ "అయితే ఈసమాజంలో ఎవరైనా కలవాలనుకుంటే"

కృష్ణ "ఇందులో కలియుడమంటూ వేరేలేదు. క్రైస్తవుల

మాత్రం దీనికి బాప్టిజంలేదు. విశాలమైన భావాలు ఎవరి హృదయాలలో విజృంభించి ప్రకాశించునో అట్టివారికి చిన్న చిన్న భేదాలు. కులతత్వము వదిలిపోయి వారంతట వారే బ్రాహ్మలయిపోతారు. అప్పుడే వారంతా దైవసాన్నిధ్యంలో ఒకేదివ్య సీతసుఖ్యై కలసి ప్రేమానందాలు అనుభవించుతారు.”

గ్రేస్ “అయితే కృష్ణబాబు, మరి, బ్రాహ్మలు దీక్ష అంటారేమిటి? నాకుకాస్త తెలియ చెప్పండి.”

కృష్ణ “గ్రేస్, బ్రాహ్మలకు దీక్షవుంది కాని క్రైస్తవుల బాప్టిజంకు దీనికీ ఏమీ పోలిక లేదు. బాప్టిజం అయితేనే గాని క్రిస్టియను కాజాలడని వారి కొకనమ్మిక ప్రబలంగా వుంది. కాని బ్రాహ్మల దీక్ష అటువంటిది కాదు. ఈదీక్షకు ప్రాముఖ్యత ఏమీలేదు. దీక్షపుచ్చుకుంటే గాని బ్రాహ్మకాడని, పుచ్చుకుంటే అవుతాడని వీరి నమ్మకము కాదు. రవీంద్రుడువంటి విశాల భావాలు కలవారు ఇదే పదే పదే చెపుతున్నారు. ఇంతకూ కించిన్మాత్రభేదాలు నశించి విశాలమైన భావాలు కలిగి పరమేశ్వరుని మననము చేసే ప్రతివ్యక్తీ ఈ ఆధ్యాత్మికోపాసకుల కూటమిలో దీక్ష పుచ్చుకొన్నా, పుచ్చుకొనకపోయినా చేరుతాడు. అప్పుడతడు బ్రాహ్మ అన్నమాట. అందుచేతనే ఈఉపాసకుల కూటమి హిందువులను, మహమ్మదీయులను, క్రైస్తవులను, జైనులను, పారసీలను అందరినీ ప్రేమహస్తాలతో ఆహ్వానించుతూంది. ఈకూటమిలో అటువంటి భేదాలకు చోటులేదు.”

గ్రేస్ “అబ్బా, యిప్పటికర్థమైంది కృష్ణబాబు. ఎల్లాగైనా

పుస్తకాల్లో చదివేదానికి ఒకవ్యక్తి ఎదురుగా వుండి బోధచేసే దానికి చాలా తేడావుంది సుమండీ. మీరిచ్చిన బ్రాహ్మమత గ్రంథాలు చదివినానన్నమాటే కాని ఈముఖ్యాంశము బాగా బోధపడింది కాదు. ఇప్పుడు బాగా తలకెక్కినదండీ, కృష్ణ బాబు."

రాధాకృష్ణ నవ్వుచు "అయితే ఇప్పుడేమిటి చేయుడము" అన్నాడు.

గ్రేస్ వ్రీడాభరమున తలవంచి చిఱునవ్వుతో "కృష్ణబాబు, అయితే మనము బ్రాహ్మల్లో కలియు నక్కర లేదన్నమాటే కదూ."

కృష్ణ "అవసరము లేదు. కలియడమంటూ వొకటివుంటే కదా, మనము దానిలో కలియుట (నవ్వుచు) గ్రేస్, దేనికి మనము దానిలో కలియడము?"

అప్పుడు గ్రేస్ తరళనయనములలో నామెహృదయ కుహర మున దాగుకొనియున్న చిఱునగవు ఒక్కసారిగా వ్యక్తమయి నది. ఆమె మెల్లగా "మీకు తెలియదా యేమిటి?" అన్నది.

కృష్ణ "గ్రేస్, నాకు తెలియకనే కదా నిన్నడగడము" అని నవ్వినాడు.

గ్రేస్ శాంతమధురస్వరమున "మీరల్లాఅంటే చెవుతాను వినండి. మన వివా —" ఇక మాటాడలేక పోయినది.

కృష్ణ "గ్రేస్, తెలిసింది. ఇక చెప్పనక్కరలేదు. అన్నట్టు మరిచిపోయాను. వీరేశలింగముపంతులుగారితో మాట్లాడాను,

ఆయన్ని గురించి ఇదివరకు నీకు చెప్పేవున్నాను. బ్రాహ్మల పద్ధతిగా చేయడానికిన్ని, ఆయన ఆచార్యపీఠం ఆక్రమించుటకున్నూ మాటాడివచ్చాను ”

గ్రేస్ “చాలా బాగుంటుంది. కాని ఈ సమయంలో నాకు మనము అపరిమితానందంలో గడపిన సంవత్సరాదిరోజు జ్ఞాపకము వస్తూవుంది సుమండీ. ”

* * * *

వీరేశలింగము పంతులుగారి తోటలోని భవనమంతయు పచ్చని తోరణములతోడను, రంగురంగు కాగితముల దండల తోడను మనోహరముగ నలంకరింపబడినది. జనులు క్రిక్కిరిసి యున్నారు. హైందవులు యాంగ్లోయిండియనులు నేడీభవనమున నొక్కహృదయముతో నాసీనులై యుండిరి. అందరు నాత్రముతో గాంచుచుండగనే వీరేశలింగముపంతులుగారు, రాధాకృష్ణ, ఆకుపచ్చని సిల్కుచీరె ధరించుకొని గ్రేస్, సరళాదేవి వచ్చి కూరుచుండిరి. ఆనందపులకితశరీరములతో ఈశ్వరదాసు, స్టేషనుమాష్టరు పురుషుల నడుమను, ఈశ్వరదాసుసతి, స్టేషనుమాష్టరుభార్య యువతీబృందము మధ్యను గూరుచుండి యున్నారు. గ్రేస్ పరిచితలగు యాంగ్లోయిండియను రమణీమణులు నీలాశోకచిలుకరంగుల వస్త్రముల నలంకరించుకొని వచ్చియుండిరి. అంతటను నిశ్శబ్దముగ నున్నది.

ప్రథమమున నొక కీర్తనపాడినారు. వరుడును, వధువును, ఆచార్యుడును తమస్థానములం దాసీను లయినతరువాత ఆచార్యు

డైన వీరేశలింగముపంతులు ఈవిధమున వివాహ మహో త్సవము నుపక్రమించెను.

శ్లో॥ ఓం యో దేవోఽగ్నౌ యోప్సు
యో విశ్వంభువనమావివేశ
య ఓషధీషు యో వనస్పతిషు
తస్మై దేవాయ నమోనమః.

(ఏ దేవుడు అగ్నియందును, జలమునందును, తరు గుల్మ లతాదుల యందును, వృక్షముల యందును, లోకమం దెల్లెడ లను వ్యాపించి యున్నాడో ఆ దేవునికి నమస్కారము. నమస్కారము.)

శ్లో॥ నమశ్శమ్భవేచ మయోభవేచ నమశ్శఙ్కరాయచ
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ.

(నీవు సుఖకరుడవు. కళ్యాణకరుడవు. సుఖకళ్యాణముల కాకరుడవు. కళ్యాణుడవును, కళ్యాణతరుడవును, నీవే. నీకు నమస్కారము.)

ఆచార్యుడు; (వరునితో) శ్రీమాన్ రాధాకృష్ణ! నీవు పర మేశ్వరుని యెదుటను, ఈ సభ్యుల సమక్షమునను, నీయంతట నీవు నీ యిచ్ఛాపూర్వకముగా ఈ సౌభాగ్యవతి యగు శ్రీమతి గ్రేస్‌ను, నీ ధర్మపత్నిగా స్వీకరించుటకు కృతసంకల్పుడ వయినావా?

రాధాకృష్ణ: కృతసంకల్పుడ నయినాను.

ఆచార్యుడు: (వధువుతో) శ్రీమతి గ్రేస్! నీవు పరమేశ్వ

రని యెదుటను, ఈ సభ్యుల సమక్షమునను, నీయంతట నీవు నీ యిచ్ఛాపూర్వకముగా ఈ శ్రీమాన్ రాధాకృష్ణను నీపతిగా స్వీకరించుటకు కృతసంకల్పురాల వయినావా?

గ్రేస్ : కృతసంకల్పురాల నయినాను.

ఈశ్వరదాసు, స్టీవెనుమాష్టరు నయనములనుండి యానంద బాష్పములు భూమిపై బడినవి. సభ్యులు తమలో తాము "నేడు బ్రాహ్మసమాజము, దానితోపాటు ఆంధ్రజాతీ ధన్య మైన" వని గుసగుస లాడిరి.

ద్వితీయ కీర్తన పాడిన తరువాత బ్రాహ్మోపాసన మైనది. పిదప మరియొక కీర్తనను బాడిరి. తరువాత ఉద్వాహప్రతిజ్ఞ ఈ విధమున చేయబడినది.

రాధాకృష్ణ "శ్రీమతి గ్రేస్! ఈ పింగళి సంవత్సర శ్రావణ బహుళ విదియ ఆదివారమునాడు రాధాకృష్ణ అను నేను సర్వ సాక్షియును సత్యస్వరూపుడును నైన పరమేశ్వరుడు సాక్షిగా సమావేశులైన యీ బంధు మిత్రుల సమక్షమున నిన్ను నా ధర్మపత్నిగా నా యంతట నేను నా యిచ్ఛాను సారముగా పరిగ్రహించు చున్నాను. సుఖమునందును, సంపద యందును, ఆపదయందును, ఆరోగ్యదశయందును, అనారోగ్యదశయందును, నీ సహచరుండనై నీ శ్రేయోభి వృద్ధి కొఱకు సర్వదా ప్రయత్నించెదను. నా హృదయము నీయది యగు గాక! నీ హృదయము నాయదియగు గాక! మన యిరువురి హృదయము లేకమై పరమేశ్వరునివి యగుగాక!

గ్రేస్ వరునితో : శ్రీమాన్ రాధాకృష్ణబాబు ! ఈ పింగళ సంవత్సర బహుళ విదియ ఆదివారమునాడు గ్రేస్ అను నేను సర్వసాక్షియును సత్యస్వరూపుడు నైన పరమేశ్వరుడు సాక్షిగా సమావేశులయిన యీబంధుమిత్రుల సమక్షమున మిమ్ము నాపతిగా నాయంతట నేను నా యిచ్ఛానుసారముగా పరిగ్రహించుచున్నాను. సుఖమునందును దుఃఖమునందును, సంపదయందును ఆపదయందును, ఆరోగ్యదశయందును అనారోగ్యదశయందును, మీ సహచారిణినై మీశ్రేయోభివృద్ధి కొఱకు సర్వదా ప్రయత్నించెదను. నాహృదయము మీయది యగు గాక ! మీహృదయము నాయది యగుగాక ! మన యిరువురి హృదయము లేకమై పరమేశ్వరునివి యగు గాక !

గ్రేస్ ఈవిధముగ ననిన పిదప వధూవరులు పుష్పహారములు నొండొరులకంఠములను వేసికొనిరి. ఆసమయమున ఈశ్వరదాసు స్టీవెనుసూస్టరు హృదయములు ఆనందముతో నుప్పొంగిపోయినవి. సభ్యులలో నొకడు మిత్రునితో "పుష్పహారాలు వేసేప్పుడు వారి హృదయాలలో ఏముంటుందో చెప్పవోయీ" అన్నాడు.

మిత్రుడు "ఏముంటుంది! అప్పుడు వారి హృదయాలలో ఎట్టిభావమూ వుండదు. ఎట్టికోరిక ఉండదు. అప్పుడవివిమలమై శూన్యమై ఉంటవి." అన్నాడు. సభ్యులేకకంఠమున స్వస్తివచనము జెప్పినారు. తరువాత వధూవరులు మిళిత ప్రార్థనము నీవిధముగ చేసిరి. "సకలశుభప్రదాయకుడవైన

దేవా పరమేశ్వరా! మేమీనా దినమున జేసికొనిన పవిత్ర ప్రతిజ్ఞలను సర్వదా పరిపాలించునట్లు మాకు సహాయుడ వగుము. ”

చతుర్థకీర్తన పాడినపిదప ఆచార్యుని హితోపదేశము, ప్రార్థన, ఆశీర్వచనముకూడ నైనవి.

నమస్తే నమస్తే జగజ్జన్మహేతో !
నమస్తే నమస్తే మహత్కీర్తికేతో !
నమస్తే నమస్తే మహాపుణ్యసేతో !
నమస్తే నమస్తే నమస్తే మహేశ !

తరువాత నెల్లరు నైక్యమధురస్వరమున మంగళకీర్తన బాడిరి.

మిత్రులు ప్రహృష్టహృదయులై రాధాకృష్ణకు గ్రేస్‌కు బంగారు గడియారములు, కెమేరాలు, ఆంధ్రఆంగ్లేయ గ్రంథములు, దువ్వాలువలు, స్వర్ణభూషణములు మఱియు ననేక అమూల్యాలంకారములు ఉపహారములుగా నొసంగిరి. నవదంపతులు సంఫుల్లహృదయములతో నుపహారముల నెల్ల గైకొన్నారు.

ఆచార్యుడైన వీరేశలింగముపంతులు సంతోషిత హృదయమున నొక మిత్రునితో “ఎన్నో వితంతువివాహాలు చేశానుకాని నేడుకలిగినంత ఆనందము ఎప్పుడూ కలుగలేదండీ! నేను బ్రతికి, బాగావుండి నాస్వీయచరిత్ర మూడవభాగము వ్రాస్తే ఈ ఉత్తమవివాహము గురించి ఇరువయి పుటలకు తక్కువ కాకుండా వ్రాస్తాను. ఈపెండ్లి మూలంగా జాతిభేదం నశించుటయే కాకుండా ఇటు ఆంధ్రజాతికి అటు యాంగ్లో

యిండియనుజాతికి మొత్తముమీద లోకానికి శోభ కలిగింది తప్పక ఈదంపతులు సౌఖ్యమనుభవించుతారు. " అన్నాడు.

* * * *

ఈశ్వరదాసు కఠినపునంఘముః పెట్టు బాధలకు తలయొగ్గు వాడు కాడు. అతనికిట్టి బాధలవల్ల నావంతయు భయములేదు. గ్రేస్ వారముఃరోజులు ఈశ్వరదాసుని యింటనే యున్నది. తరువాత అతనికోరికపై నా నవదంపతులు గ్రీష్మమును నీలగిరి పర్వతముపై గడుప బ్రయాణమైరి. ఆనఁదహృదయమున సరళాదేవి విజయవాడవఱకు బంపుటకు గ్రేస్ కోరికపై బ్రయాణమైనది. వత్సరాదినాడు బహుమానమందిన వనికత్తె కూడ రాధాకృష్ణ ఆజ్ఞానుసారము నీలగిరిపర్వతమునకు ఉప్పొంగిపోవుచున్న హృదయముతో బయలుదేరినది.

ఆనాడు సాయంకాలము రాజమహేంద్రవర రైల్వేస్టేషను ప్లాటుఫారము జనులతో కిటకిట లాడుచుండెను. యాంగ్లో యిండియను యుద్యోగీయులెల్లరును నాసమయమున నచటనే యుండిరి. మెల్లగా రైలు కదలినది. గ్రేస్ ఎంతో విచారమును సూచించునయనములతో జననీజనకులను, ఈశ్వరదాసు దాను నతివైపు జూచినది. అప్పుడామె హృదయాంతరమున నెవరికి తెలియకుండ దాగియున్న మధురార్ద్రభావములు ఆ శాంత మయనయనములలో నొక్కమారుగా పరిస్ఫుటమయినవి. "మిమ్మల్ని విడిచివెళ్ళడము కష్టమైనవని. సంఘాన్ని ధిక్కరించి ఈ వివాహం చేసుకోవడములో నా కింతకష్టము కనిపించలే"

దని యామె ఆర్ద్రహృదిపులకరిత నేత్రముల మూలమున అంతరిత ప్రభావములను వెలిబుచ్చినది. తలిదండ్రులటులే ఆ పులకరిత మనోహరనేత్రః బల వీక్షించుచు నిస్తబ్ధులై నిలువబడి పోయినారు. యాంగ్లోయిండియను రమణులు చేతిరుమాళ్ళ నూపియు, చేతులనూపియు తమ తోషిత హృదంతరభావములను దెలిపిరి. చెలికత్తెలకు తన మనోహరతరళనయనములతో డనే గ్రేస్ జవాబు చెప్పినది. అందరు నాబండివైపు తదేక దృష్టితో జూచుచు గ్రేస్ రాధాకృష్ణుల ప్రేమానుబంధమును భావించుకొన్నారు. కొందఱు ఆదర్శప్రాయ రాగబంధమును సానందముగ నుతించినారు.

ఒక చిన్న అమాయకపు యాంగ్లోయిండియను బాలిక జనకునిజూచి " డేడీ ! నేనుకూడా హిందూనుపెళ్లి చేసుకుంటే, యిల్లాగే నీలగిరి వెళ్ళవచ్చుకదూ." అన్నది.



# నీలాపనింద

గోదావరి జిల్లాలో ఒకపట్టణం, దానికిరవై మైళ్ళ దూరంలో కారడవి ఉంది. ఆ అడవి [illegible]ఘుగనే తుమ్మలవూడి అనే కుగ్రామం. ఇప్పటి కిరవై సంవత్సరాలైంది, ఈ కథ జరిగి.

అసలే చిన్నపల్లె: వాళ్ళ బ్రతుకు తెరువు అడవిలో పుల్లలేరుకొనడం, కాయాగసరు పెర్చి తెచ్చుకొనడం. ఒకవైపు ఏలూరు పట్టణం, మరొకవైపు పూళ్ళగ్రామం. ఆ వస్తువులు తీసుకుపోయి, వాటికి బదులు ధాన్యం, గడ్డి, పప్పు, ఉప్పు తెచ్చుకొని ఆ గ్రామస్థులు బ్రదుకుతున్నారు. వర్షాల కేమైనా పండితే, జొన్న, గంటి, చోళ్ళు వాళ్ళ ఆహారవస్తువులు. పక్షులు, జంతువులులాగు బ్రతికే వాళ్ళకు, చదువు సంధ్యలు, నాగరకత ఏమి తెలును! కనిపించే సూర్యచంద్రాదులు, ఉరుములు మెరుపులు, సర్పాలు, జబ్బులుచేస్తే పోలేరమ్మ, వూంతలో ముసలమ్మ వాళ్ళ దేవుళ్ళు. సంవత్సరాని కొకసారి మాత్రం జీలకర్ర గూడెం అమ్మోర్మ్మ జాతరకు వెళతారు. అయితే వీళ్ళ జీవితాలు అటు కోయజాతికీ, ఇటు కాల్వక్రింద గ్రామస్థులకూ చెందకుండా ఉంది.

ఆ గ్రామంలో ఒక కాపు కుటుంబంలో ఏడుగురు అన్నదమ్ములున్నారు. అందులో తుదివాడు వెంకయ్య, భార్య మల్లమ్మ. పెళ్ళిఅయి ఐదారు సంవత్సరాలైంది. వీరిద్దరు చిలక గోర్వంకల్లాగు, గువ్వజంటలాగు అన్యోన్యంగా ఉంటు

న్నారు. మల్లమ్మ నీడలాగు ఎప్పుడూ వెంకయ్యను అంటిపెట్టు కునే ఉండేది. చల్దిమూట పట్టుకుని పెనిమిటితో అడవికి వెళ్లు తుంది. సంతకు వెళితే వెంటఉండాలి; సరుకుల కోసం వెళితే వెంట తయారు. మబ్బులు, మబ్బులూ కలిస్తే మెరుపులు రావ డములే! అలాగే ఈ జంటజీవితంలో ప్రేమ అనే మెరుపు తీగలు వారికి తెలియకుండానే మెరుస్తూ ఉండేవి. బురదనీళ్ళలో నుండి తామరపువ్వులు రావడములేదూ! అల్లాగే ఆ గ్రామ స్థుల మధ్య వీరిద్దరూ ఉన్నారు. అయితే వెంకయ్య ఏది గడించి తెచ్చినా పెద్దన్నగారి చేతుల్లో పెట్టవలసిందే.

ఇలా ఆ దంపతుల జీవయాత్ర సెలయేరులాగా జలజల సాగిపోతూంది. ఆ చిన్న యేటి నీటికి ఒకరాతిగుట్ట అడ్డువచ్చింది. తోటికోడలు లాకాపె మల్లమ్మ వొంటిమీాద నల్లనిమచ్చలు నీళ్ళుపోసుకుంటూంటే కనిపెట్టింది. ఇంకేముంది? మేహ పాడలో, మరేమిటో అని తనభర్తతో చెప్పివేసింది ఆవిడ. మరునటిరోజు అడివికి పోకుండానే అన్నదమ్ములంతా సభతీర్చి చిన్నతమ్ముడు వెంకయ్యను పిలవనంపారు. ఏమిప్రమాదం వచ్చిందో అని వెంకయ్య దిగులు పడుతూ అచటికి చేరాడు. పెద్దన్న సన్నని కంఠంతో వెంకయ్యకేసి చూచి: "ఒరే, వెంకా! అప్పుడు చెపితే విన్నావుకాదు. కాల్వక్రింద పూరిపిల్ల అంటే ఎదురొమ్ముమీాది కుంపటిరా బాబు అన్నా, వినిపించుకో లేదు. నీ పెళ్ళానికి పెద్దపెద్ద మచ్చలున్నవట, అవి కుష్టుక్రింద తేలొచ్చు. అటువంటి పెళ్ళాముతో కాపరం ఏమిటిరా,

వెంకా !" అన్నాడు. చాటునుండి వింటూవున్న మల్లమ్మ వణికిపోయింది. ముసలితల్లి ఒకటి రెండు కన్నీటిబొట్లురాల్చింది. ఈ చిన్నకోడలంటేను, కడపటి కొడుకన్నా ఆమె కెంతో ఆప్యాయం. ఏమిచేయగలరు? ఇద్దరూ ఆడవాళ్ళే. తీర్పుచెప్పేది ఆరితేరిన మగవాళ్ళు. వెంకయ్య మొట్టమొదట కొంచెం భయపడ్డాడు. గుండెగొంతుకలో తడబడుతూంటే ధైర్యం చిక్కబట్టుకొని కన్నతల్లివైపు, చేసుకొన్న పెళ్ళాము వైపూ చూసి: "పెద్దన్నా, కన్నతండ్రి పోయాక నువ్వేతండ్రి అనుకుంటున్నాం, మేమంతా. కాని ఈ సంగతిలో మాత్రం నీ మాట వినను. వింటే ఘోరపాపం చేసినవాణ్ణి అవుతాను" అన్నాడు.

"అయితే, ఏమంటావు! సభతీర్చాం, తీర్పుచెప్పమంటావా!"

"చెప్పుకోండి, మీాయిష్టం" అని గళం సవరించుకొని అన్నాడు వెంకయ్య.

"నువ్వు పెళ్ళాన్ని వదిలివేయాలి, లేదా పెళ్ళాంతో ఈవూరు విడిచిపెట్టిపోవాలి"

"రెండోపని చేస్తాను" అని వెంకయ్య లేచిపోబోయాడు.

"మాకుటుంబంతాలూకు చిల్లిగవ్వకూడా నీకు ముట్టదు సుమా!" అన్నాడు పెద్దన్న.

"సరే" అని వెంకయ్య లేచాడు. కడసారికొడుకు దిగాలు పడిన ముఖంచూచి కన్నతల్లి నిలువున కూలిపోయింది. పెద్ద కొడుకుమాట కెదురుచెప్పలేదు, ఎంతపండిన ముసలిదై పోయినా కూడా. మల్లమ్మ అత్తగారికి ధైర్యంచెప్పింది.

తెల్లవారకముందే లేచాడు వెంకయ్య. భార్యనుకూడా తట్టిలేపాడు. రెప్పవాల్చక రాత్రంతా కూర్చొనివున్న తల్లి దగ్గరకువెళ్ళి కాళ్ళకు సాష్టాంగపడి దణ్ణంపెట్టాడు వెంకయ్య, మల్లమ్మ అదేరీతిగా అత్తగారికాళ్లు ముట్టుకుంది. ఆ కన్నతల్లి కడుపు చెరువైపోయింది. ఏకధారగా కన్నీరు విడిచింది. గుండె నిబ్బరంచేసుకొని తల్లి లేచివచ్చి నిండావున్న నేతిపిడత ఒకటి, మేకపిల్ల నొకదాన్ని కొడుక్కు, కోడలికి ఇచ్చింది: "నేనిచ్చే దిదేరా, వెంకా! పెద్దోడు ఇంటికిపెద్ద. వాడిమాటకు నేనెదురు చెప్పేటంతదాన్ని కాదు. ఎక్కడైతేనేమి, పదినాళ్ళు నీవు, మల్లమ్మ సుఖంగా ఉండండి. బ్రతికి బాగాఉంటే మళ్ళా ఎప్పుడో చూసుకుందాము." అన్నది తల్లి.

వెంకయ్య: "అమ్మా, బ్రతికుంటే బలుసాకు లేరుకుతింటాము. దీని పుట్టింటిఊళ్ళో పనిచేసుకు బ్రతుకుతాము. వానకురిస్తే అందరిమీద పడుతుందికాని మంచివాళ్ళమీద పడి, చెడ్డవాళ్ల మీద మానివేయదు. వాన, గాలి ఎంత వీచినా గువ్వలజంట ఒకటి నంటుకొని ఒకటి ఉంటయికాని దేనిత్రోవ అది చూచుకోదు. మాబ్రతుకుకూడా అంతేనే, అమ్మా" అన్నాడు.

తల్లి: "ఒరే, అబ్బాయీ, తామరపువ్వు ఏ యెండవల్ల పూస్తుందో, నెలవుతప్పిస్తే ఆయెండవల్లనే వాడిపోతుంది. మల్లమ్మను నువ్వు వదిలివేయడం నాకు ననేమిరా యిష్టంలేదు.

పదివళ్ళు పండించుకొని పదిలంగా ఎక్కడైతేం బ్రతకండిరా బాబూ."

భుజంమీద కావిడివేసుకొని వెంకయ్య - ఒకచేత మేక, మరొకచేత చల్దిమూట పట్టుకొని, మల్లమ్మ కాల్వదిక్కుగా పెద్దలతో చెప్పి బయలుదేరారు.

అన్నదమ్ములలో నడిమివాడు కొంచెము టక్కరి. చిన్న తమ్ముడు అరక్రోసుదూరమైనా వెళ్లాడో లేదో అతను పెద్దన్న దగ్గరకు పరుగెత్తి: "ఒరే, పెద్దన్నా, వెంకడు పోయేవాడు పోక డబ్బుపిడతకూడా తప్పుకుపోయాడురా! ఇదో కిందపడ్డ రూపాయి వొకటి దొరికింది, చీకట్లో త్రవ్వుతూఉంటే ఇది కింద పడుంటుంది" అన్నాడు.

పెద్దవాడు నిర్ఘాంతపోయాడు. "చిల్లిగవ్వకూడా ముట్టదని నిన్న చెప్పినందుకు ఫలం ఇదిలాగుంది! గవ్వకుబదులు కడివెడురూపాయలు పట్టుకుపోయాడు. ఆకుండ పాతిపెట్టిన చోటు నాకు, వాడికి తప్ప ఇంకెవ్వరికీ తెలియదురా! చూస్తావేం, వెనక్కులాక్కురా వాణ్ణి" అన్నాడు పెద్దన్న.

ఆజ్ఞ అవడం తరవాయిగా నడిమివాడు పరుగుతీశాడు. ఆజంట పొలిమేర దాటారో లేదో ఇతని కేక విని కంగారు పడుతూ వెనక్కితిరిగారు. మేకను బయటకట్టివే, మల్లమ్మ లోన ప్రవేశించింది. వెంకయ్య బయటనే పెద్దన్న కెదురుగా నిలుచుండి పోయాడు.

అతడు చిన్నతమ్ముడికి క్రిందపడిన రూపాయికాసుచూపించి:

"ఒరే, వెంకా, ఈబిళ్ల చూశావా?" అన్నాడు.

వెంకయ్య కిదేమీ బోధపడలేదు. "చూశా" నన్నాడు.

"గడ్డివాము తూర్పుదిక్కుగా కాకరపాదుక్రింద పాతిపెట్టిన రూపాయలకుండ సంగతి నాకు, నీకు తప్ప ఇంకెవరికీ తెలియదు. అది మాయమయ్యింది. మాఅందరికీ నీమీద గట్టిఅనుమానం. నువ్వు తవ్వుతుంటే కిందరాలిన రూపాయిబిళ్ల యిది."

వెంకయ్య నిలువున నీరైపోయాడు. భార్యను వదలిపెట్టమని అతడన్నప్పుడుకాని, ఊరువిడిచి పొమ్మన్నప్పుడుకాని అతని గుండె యింత దడదడా కొట్టుకోలేదు. కళ్ళు తిరిగినట్లయింది. ఒళ్లంతా చమట్లు పట్టినయి.

వెంటనే ధైర్యం చిక్కబట్టుకొని "నే నేపాపపుణ్యాం ఎరగను" అన్నాడు.

పెద్దన్న: "ఎంతటి నావసానివోయి! అయితే నేను తీశా నన్నమాట."

వెంకయ్య: "పాపపుణ్యాం దేవునికే తెలుసు. అమ్మయిచ్చిన మేక, నేతిముంత తప్ప — చలిదన్నంమూటతప్పితే నేను చిల్లిగవ్వ ఎరగను. (కర్వాత మీాయిష్టం"

పెద్దన్న: "అయితే, చెరువులో మునిగొచ్చి, అమ్మోరి గుడిలో ప్రమాణంచేసి దీపం ఆర్పుతావా?"

వెంకయ్య: "నువ్వు ఏమిచేయమంటే అదిచేస్తాను, పెద్దన్నా"

నడిమివాణ్ణి పిలిచి పెద్దవాడు గుడిలో దీపం తయారు చేయమని సెలవిచ్చాడు.

లోన అడుగైనా పెట్టకుండా వెంకయ్య బయటనుండి బయిటికే పోయి చెరువులో మునిగి వచ్చాడు. ఏ మాత్రం జంకు గొంకు లేక సాహసంతో పెద్దన్న కెదురుగా తడిగుడ్డలతో వచ్చి నిలిచాడు.

తల్లి కడసారికొడుకు కెదురుగా గుమ్మంలో సదికిల పడింది. ఆపెకు అందరిమీదకంటె చిన్నవాడిమీద అపారమైన ప్రేమ. ఏమైనా కన్నకడుపుకదా! ఆమె గుండెలోను, కడుపులోను ఏదో క్రూరహస్తం దొలిచివేసిన ట్లయింది, వెంకయ్యమీద ఈ నెపం మోపినందుకు. పండుముదుసలి, 'ఏమిచేయగలదు? పావం! నీటిధారగా కార్చింది కన్నీరు, కిక్కురు మనకుండా.

మల్లమ్మ ధైర్యంగానే ఉంది, భర్తస్వభావం బాగా తెలసి కొన్నది గనక. చిన్నపిల్లలు తోలుబొమ్మలాట చూచేటట్లు ఈ క్రొత్తనాటక ప్రదర్శనం చూస్తూ నిలుచుంది మల్లమ్మ.

పెద్దన్న: "అల్లా, నిలుచుంటావేమిరా! వెంకా! పోయి దీపారాధన చేయి"

వెంకయ్య తటాలున వెళ్ళి దీపం వెలిగించి: "ఓ, దేవుడా! నే నేపాపపుణ్యం యెరగను. నేను రూపాయిల ముంత ముట్టుకో లేదు." అన్నాడు చురుకుగానే.

పెద్దన్న: "ఇక దీపం ఆరిపేయి"

వెంకయ్య చేయిఊపి ఒక్కసారిగా దీపాన్ని ఆర్పివేశాడు.

"ఇక నా పని అయిపోయింది" అని మల్లమ్మను వెంటతీసి కొని బయలుదేరాడు, మరల తల్లితోను, పెద్దన్నతోను చెప్పి

సెలవు తీసికొన్నాడు.

"మన మేపాపపుణ్యాం ఎరగనప్పుడు ఎన్నిదీపా లార్పి స్తేనేం! దొంగవసి చేసినవాడినే చుట్టుకుంటుం దాపాపం" అన్నది మల్లమ్మ పినిమిటితో.

* * * * * *

నడిమివాడు పదిరోజులకే జెంగతో మంచం పట్టాడు. తాను చేసిన పాపం పెద్దన్న ముందు తనంతతానే ఒప్పివేసుకొని, కన్ను మూశాడు.

వెంకయ్యా, మల్లమ్మ సుఖంగా కాపరం చేయడమే కాకుండా రత్నాల్లాంటి బిడ్డలను కన్నారు. మల్లమ్మకు గాని, బిడ్డలకు గాని మచ్చలు ఏమీ బాధకలిగించలేదు. వారిద్దరు నీతి నియమాలు, ప్రేమబంధం తేగలతంవరవలె పెరిగి పోయిన సంతానంలో చక్కగా ఈనాటివరకూ ప్రతిబింబిస్తూంది.



# పరిణామం

కొలనిలోవుండే కప్ప ఎల్లప్పుడూ అచటనే ఉంటుంది: తామర పూలు ప్రక్కనే ఎంతో ముచ్చటగా తేనెతో తొణుకులాడుతూ వుంటవి. ఎక్కడనుంచోవచ్చి తేనెటీగ అందలి మధువును ఆస్వాదించుతుంది — సమీపముననే ఉంటేమాత్ర మేమి కప్ప:

ఎన్నో రసవంతమైన భావాలు. మానవలోకమునుండి దేవలోకానికి గొనిపోయే రెక్కలనిచ్చే గడ్డిపూలు, సూర్యోదయం, అస్తమయాకాశం, చుక్కలతో, చందమామతో కలకలలాడే ఆకాశవీధి, స్వేచ్ఛా పుంజములైన రంగు రంగుల పక్షులు — ఇంకా ఎన్నో మనోహర దృశ్యాల నడుమనే ఉన్నాము మనము — కాని రసాస్వాదులు ఎంతమంది ఉన్నారు?

అతడు ఆరుబయట, చెట్ల నడుమ కూర్చుని చిత్రవిచిత్ర మైన రజనీకాంత మేలిముసుగు ఛాయలం దైక్యమైపోయే సంధ్యారాగాన్ని చూస్తూ ఇంకోలోకంలో నడయాడు తున్నాడు. ఎవరో మిత్రుడు వచ్చి పలకరించేటప్పటికి అత డీ లోకంలోకి దిగివచ్చాడు.

*   *   *   *

కబుర్లు చెప్పుకుంటూ మిత్రునితో అతను కోటిలింగాల దగ్గరి స్మశానవాటిక మీదుగా క్లబ్బుకు వెళ్లకుండానే మామూలువేళ కాకుండానే ఇంటికి చేరుకున్నాడు.

ఇంట ప్రవేశించాడు: నిస్తబ్ధుడై పోయాడు............

చూచినదేమిటి? — తన యిల్లాలు.....ఎవరి ఒడిలో

పరాయివాని ఒడిలో......

తల గిర్రున తిరిగిపోయింది. ఇంకో గదిలోకిపోయి కూలబడి పోయాడు; తనకు వశంలేకుండగనే మేధస్సు గిరగిరా తిరిగి పోతూంది.

కొంతసేపటికి తెలివితెచ్చుకొని తేరుకున్నాడు. ఆరు సంవత్సరాల క్రిందటి పెండ్లినాటి దృశ్యం కళ్ళకు కట్టినట్లయింది. అంతకుముందు జరిగిన పరస్పరానురాగపు చర్యలు — యౌవన దశకలిమితో గడిపిన ఉద్వేగపు జీవిత ఘట్టాలు — చేసికొన్న ప్రేమవాగ్దానాలు — ఆడుకున్న ఆటలు — పాడుకున్న పాటలు — పలికిన పలుకులు — తరంగాలపై తరంగాలవలె మనో సముద్రంలో పొర్లిపోయినవి. నేటికిలా జరిగింది. కలిగిన ఫలితం ఇంత నిర్వ్యాకంగా ఉంది.

అయితే ఇకముందు జరగవలసినచర్య: కారణయుక్తంగా — అన్యాయకాదా మరి! భార్య పరాయివానితో కలిసివుంటే — ఆలోచించాడు. నాలుగేళ్ల బిడ్డ ఉంది. ఏమిచేయడం? ఆమెను విలువగల నగలతోనహా వదలివేయడం. ఆడబిడ్డను మాత్రం తాను పెంచడమూ — నిశ్చయించుకొన్నాడు.

తణుకు బెణుకు లేకుండా మనస్సు వణకుతూవున్నా ఆమెతో చెప్పివేశాడు తన నిశ్చయం.

ఏమేమో సాకులుచెప్ప మొదలిడింది. కళ్లారా చూశాక ఇంకా కావలసిన ఋజువేమిటీ? కారణాలేమిటీ?

* * * *

తాను, తన చిన్నబిడ్డ యింటమిగిలారు. పిల్లను పెంచడానికి తానేతల్లి, తండ్రికూడా అయ్యాడు. నడివయస్సులో వుంటే మాత్రం, బిడ్డ ఉండగా, ఇట్టి అనుభవం కలిగాక మరలా పెళ్ళి తలంపా? అనవసరం — అనుచితం.

అసూయ, వ్యాకులం, చింత, చీకు — జరిగిన సంగతుల గూర్చి విచారణ వలదు అని అనుకుంటాడు — కాని క్రుంగి కృశించిపోయాడు. చంటిపిల్లకోరకే జీవించిఉన్నాడు. ఇంట తాను, కూతురు.

భూగర్భంలో ఉంచిన గింజ మొక్క మొలిచేటప్పు డేమౌతుంది? తాను నాశనమైపోయి, తనలోనుండి ఫల పుష్పా లిచ్చే మొక్కను మొలిపించుతుంది.

తాను తన కూతురుకోసం జీవిత మదేవిధంగా వ్యయపరచుకొన్నాడు. ఆదుపాజ్ఞలతో, విద్యాబుద్ధులు గరపి మనస్సుకు, భౌతిక శరీరానికి అవసరమైన ఆహారపదార్థాల నాత డాపిల్లకు చేకూర్చుచున్నాడు. నిష్కామమైన ప్రేమజలంతో, ఆ చిన్ని మొలకను పెంచి పెద్దచేశాడు. పదిహేను సంవత్సరాలు కను మూసినట్లు గడిచి పోయినవి.

* * *

గోదావరి వెల్లువలై పారుతుంది. అతని మనస్సు గౌతమీ జన్మస్థానంవైపు విహరించింది. ఎంతచిన్నదిగా పుట్టిందీనది? ఎన్నిమిట్టపల్లాలు, కొండకోనలు — కీకారణ్యాలు — ఆరుబయళ్ళు ఒక ప్రక్క ఎన్నో సెలయేళ్ళు చేరుకుంటూ ఉంటవి — ప్రవ

హించి ప్రవహించి — ఎక్కడికో అగాధమైన, అనంతమైన సముద్రంలో కలిసి సరి పెట్టుకొంటుంది — ఎందుకో, ఏలనో! ఈ నదీప్రవాహం? మానవ జీవితంకూడా అంతేకదూ? తన్ను నదితో పోల్చి చూచుకున్నాడతడు — లోచూపుతోనే.

ఒకప్రక్క చెంచులు వెదుళ్ళు చెక్కి, కాల్చి, రకరకాల వస్తువులు చేస్తున్నారు. అందులో పిల్లనగ్రోవులు కూడా ఉన్నవి. వేణువును చెక్కి చిల్లులు పొడిచి, పొగరంగు రావటానికి మంటచాటున పెడితే ఎందుకో అనుకున్నాడు. కాని అరనిముసములో ఆచెంచు గాలి ఊదుచు ఒక మధురగానాన్ని ఆ వేణువుద్వారా వినిపించాడు. ఏమి పరివర్తనం! — ఆ గాలి నుండేకదా యీగానం — తన యిక్కట్టులుకూడా ఎక్కడికి ప్రయాణం చేస్తున్నవా అని పర్యాలోచన...తన జీవనం పాటగా మారుతుందా?

చల్లగాలి షికారునుండి ఇంటికి వెళ్ళాడతడు. బిడ్డ ఏమి చేస్తుంది! —

నిశ్చేష్టుడై పోయాడు ... యౌవన ప్రాదుర్భావంతో తొణుకు లాడుచున్న ఆ చిన్నది — అత డెవరో తానెన్నడూ చూడనైనా లేదు — ఆతని ఒడిలో ఆసీనయై — పెరటిలో ముచ్చట లాడుతుంది.

ఒక్క నిముసమే. నిశ్చలత.

స్వేచ్ఛాప్రియుడైన అతని మనస్సు అంతగా నొచ్చుకోలేదు. పడుచుదనం, రక్తబలం — ఈ వయస్సులో జరిగే చర్యలే ఇవి.

ఇందులో చిత్రమేముంది? ఏపుగా పెరిగిన తీగకు చేరువ వుండ వద్దా మరి.

ఇందులో ఆశ్చర్యమేముంది? అసూయకు కారణమేముంది? వ్యాకులత పొంద వలసిన పని లేనే లేదు. స్వాభావసిద్ధమైన జీవన వికాసం కాదా యిది! ఆ వయస్సు రాగానే పక్షులు, మృగాలు — మానవులు మాత్రం! సృష్టిలీల కాదా యిదంతా!

తీరికగా మరునాడు అమ్మాయిని పిలిచి అడిగాడు. విశేషాలు: అతడెవ్వరు? విద్యా సంపదా! ధన సంపద! అన్నీ బాగానే ఉన్నవి.

"అయితే, మరి! వివాహితు డంటున్నా వేమి? అట్టి వానితో అవివాహితవైన నీకు తగునా?"

"..............."

"అసలు పెళ్ళితలంపు కలిగినదమ్మా నీకు"......

"............"

చిన్నతనం, అమాయకత్వం. దానికి తోడు ప్రపంచానుభవం బొత్తిగా లేదు. చదువు సంధ్యలు చెప్పించినమాట నిజమే! మానవతత్త్వం తెలిసికోవాలంటే యెంతో లోకానుభవం కావాలి — చిన్నదానికి ఈ విషయం తట్టనేలేదు.

*　　*　　*

సరి! నాయనగారు తెలియచెప్పారుగా? మరలా కలిసినప్పుడు, ఆ మాట, ఈ మాట అయినపిదప ఈ విషయం తర్కించింది.

పెళ్ళామూ, బిడ్డలూ ఉన్న నేను నిన్నేమి చేయగలను — ఒకవేళ చేసుకుంటేమాత్రం లోక మేమంటుంది!"

ఆమెకు పొరవిడిచింది—తండ్రి కీ కబురు చల్లగా చేరవేసింది.

"అంత, లోకానికి జడిసే మనిషి యీ చేసిన పనేమిటి?" అనుకొన్నాడు.

* * *

అతని భావప్రపంచాన్ని కప్పిన మంచుపొగ విడిచి పోయింది. ఈ చిన్న అనుభవం సూర్యరశ్మివలె పనిచేసింది.

ఇట్లు తనలోతాను తలపోసికొన్నాడు: "భార్యా విష యంలో మొదటి అనుభవం వేరు — పుత్రికానుబంధమైన ఈ అనుభవం వేరు."

"భార్యకు నాకు నడుమ పాంచభౌతిక సంబంధమైన కామముతో కూడిన మోహం — మానసికమైన, కారణ యుక్తమైన వాదన, సంఘర్షణ అందుపై చేయివేసినవి. అందు చేతనే అన్యాయ మేర్పడింది. మానసికమైన క్రోధం, హేతు వాదన, రక్తాన్ని ఉబికింపజేసి ఉడికెత్తించి, ఆమెను విడనాడు నట్లు చేసినవి.

"పుత్రికా విషయంలో —(ఆపె నాశరీరంలో ఒకభాగం — నారక్తంలోని ఒకపాయ — నిష్కామమైన ప్రేమ, నిర్మలమైన ఉజ్వలమైన అనురాగం, పవిత్రతకు నెలవైన హృదయ కుహ రంనుండి తనంతతానుగా వెల్లువయై పారే రాగవాహినిలో ఈచిన్నబిడ్డ ఒక వెల్లువ — అందుచేతనే ఈఅనుభవంలో అనూ

యుకం, కోపానికి, హేతువాదనకు, స్వార్థానికి చోటులేదు.)
ఈ చిన్నబిడ్డ చిన్నతనపు చేష్టకు ఒక్కింత విసుగు పుట్టినా ! భార్యను విడనాడినట్లు ఈ చిన్నబిడ్డను విడనాడగలనా ! ఆ ఆలోచనకే తావు లేకుండా పోయింది.

"ప్రేమ చిత్రమైంది. దానికి యథార్థము చెప్పిన పెద్ద మనిషి యేడీ! కామాన్ని, మోహాన్ని, శరీరసౌఖ్యాలను కోరే ఆశలను ప్రేమ అంటే వేలాగు ? పరస్పరమైన చనువుచే, చేరువగా నుండుటచే కలిగే శరీరాకర్షణను ప్రేమ అంటారా !

"సూర్యప్రకాశం, వర్షపాతం, ప్రకృతి అంతా చిన్న పెద్ద అనే భేదంలేకుండా, బీదా గొప్ప అనే విచక్షణలేకుండా, అన్నిటిపైన తాండవమాడుతూ ఉంటవి.

"పాంచభౌతికమైన (నరముల కూడికయైన) మేధస్సుతో, మానసికమైన హేతుజ్ఞానంతో కూడిన సతీపురుషుల పరస్పర మైన అనుబంధం — ఎప్పటికైనా, వేలాగునైనా మార్పు చెందవచ్చు.

"కేవలం హృదయానుకంపభరితమైన ప్రేమ, అట్లుకాక నిశ్చలమై, నిస్తులమై, తెగుటకు, ఆర్పుటకు వీలులేనిదై ఆత్మ సామీప్యమై వెలుగొందుతుందేమో!......ఇవన్నీ ఆలోచనా తరంగాలు అతనిలో......"

ఆనాడే, పదిహేను సంవత్సరాల క్రింద విడనాడిన ప్రేయసికై అతడు కబురంపాడు. ఆమె అప్పటికే పరితప్తహృదయయై నిర్మల జీవనం గడుపుతూ ఉండడంవల్ల వెంటనే పతి సన్నిధికి చేరుకుంది.

---

# పెండ్లినాటి ప్రేమ

ప్రేమించి పెండ్లిచేసికొను ప్రేయసీ ప్రేయసులు, పెండ్లిచేసికొని ప్రేమించు సతీపతులు — ఒకరి స్వేచ్ఛాజీవనము ప్రభాత ప్రభా కాంతిలో పులకించి వలపుల విరజిమ్ము గులాబీపువ్వు; రెండవ వారి నియమితజీవితము కృత్రిమవిద్యుత్ప్రకాశమున విచ్చిన పూవు. ఒకటి కిలకిల నవ్వుచు, గలగల ప్రవహించే సెలయేరు; ఇంకొకటి కావలసి త్రవ్వించిన కాలువ. తారతమ్యము చాల గలదు తరచినకొలది.

ప్రణయము ప్రోదిచేసికొనిన ప్రణయినీ ప్రణయశీలురు తమ నవజీవనము నలరించిన ఆకర్షణము, Romance, మధుర భావములు తరలిపోకుండ కాపాడుకోవలెను. పెండ్లిచేసికొని ప్రేమింప నలవరచుకొనిన సతీపతులు ప్రేమబాంధవ్యమును గ్రహించి జీవితముల నానంద శోభాప్రసన్నము చేకొన యత్నింపవలెను. ఒకరిజీవనము మానసికమైన ప్రేమానుభూతిలో విరిసి భౌతికానుబంధమున పరిమళించుచున్నది. ఇంకొకరి జీవితము భౌతికానుబంధమున కొనలువారి ప్రణయాత్మకమగు సుఖానందము నందవలసియున్నది. ప్రేమ అమూల్యము, అపూర్వమైన ప్రవృత్తి. పూవుకన్న సుకుమారము. సాగరముకన్న గభీరము. దానిని భద్రపరచుకొనక పోయినచో లక్ష్మికంటె చంచలము.

ప్రేమ పసివాడకుండ పెంపొందజేసికొనుటకు అనేకరీతులు. ముఖ్యముగా — మానసికమైన ప్రేమకును, భౌతికములైన అనేక విషయములకునుగల అవినాభావ సంబంధము దంపతులు కలనైన మరచియుండరాదు. ఎచటనున్న నేమి, ఎటులున్న నేమి, ఏమిచేసిననేమి యని కనులకు కనిపించని ప్రేమను అలక్ష్యము చేసినచో నదికూడ దంపతుల నలక్ష్యము చేయును. అంతియే కాదు. ప్రేమవిషయమున నెప్పుడును నొకరీతి కొన్ని సూత్రముల ననుసరించి ప్రవర్తించుటయు కూడనిపని. ఈ విషయము, ప్రేమ ఒకప్పుడు సమీపమున నున్న సతిపతుల పలుకులలో, భావములలో వికసించును. అదియే మఱియొకప్పుడు వారొకరినొకరు ఎడబాసియున్న సమయమున ప్రభవించును. సొంపుగ దిద్దితీర్చికొనిన సతిని కాంచిన నాటికన్న నిద్రితయై కేశములు గుత్తులుగుత్తులుగా శయ్యాపార్శ్వములబడి అలంకారములైన లేని సమయమున చూచి ప్రేమవశతమైమరచిన పతి కలడు. పురుషుడు చక్కని దువ్వలువలు ధరించి "బాగున్నదా అలంకారము? వంకలేమీ లేవుకదా!" అంటే "బాగానే ఉన్నారండీ" అనిన సతియే ఇంకొకప్పుడు "చుక్కబొట్టు పెట్టుకుంటే ఎంతో ముచ్చటగా ఉందిసుమండీ" అని పాలు పొంగినగతిపొంగు ప్రేమను విరియబోసిన సమయమును కలదు. సతియెడపతి — పతియెడసతి ఎక్కువ బిగియబట్టుకొని కాని, ఎక్కువ విచ్చలవిడిగా గాని వర్తిల్లుట కంటె స్వేచ్ఛగా, స్వభావసిద్ధముగా, విమల హృదయములతో ప్రవర్తించుట

లెస్స. ఒకరికిష్టమైన పను లొకరు చేయుట; ఒక్కచో గ్రంథ పఠనము; సంగీతము; ప్రకృతివైచిత్ర్యపరీక్ష; విజనభూముల, పచ్చికబయిళ్ళ వెన్నెల రాత్రులు విహరించుట — ఇవన్నియు ఆయా పరిస్థితులవారి ప్రకృతుల ననుసరించి ప్రణయాభ్యుద యమునకు, ఐక్య హృదయానందాతిశయమునకు కారణము లగును.

పెండ్లినాటి ప్రేమయొక్క బిగి కాలము గడచినకొలదియు సడలిపోవుట సాధారణముగ నందఱిదంపతుల జీవితములలో గాంచుచున్న విషయము. ఇందుకు కారణము సతీపతుల లోపమగునేమోకాని, మానవజీవితముయొక్క గాని, ఏతన్ని ర్మాతయొక్క గాని లోపముమాత్రము కాదు. ప్రారంభదిన ములలోని ప్రేమానుబంధమును దినదినము ప్రగాఢ మొనరించు టకు ఉత్తమ విషయములే కాదు, చాల స్వల్పవిషయములు సయితము తోడ్పడగలవు. కూర యేమిచేయవలెనని సతి ఆలోచించునప్పుడు పతి ఆ యాలోచనా చింతనమున సాయ పడుట, ఆమె వంటయింట పనిచేసికొనునప్పుడు తీరికగనున్న పతి ఆమె యొద్దగూరుచుండి సంతోషప్రదమైన సంభాషణ చేయుట, పతినిగూర్చి సతి "ఏమండీ, తలదువ్వనా ?" అనగా అతడు "నన్ను నీతల దువ్వనిస్తే, నాతల నిన్ను దువ్వనిస్తా" నని చిఱునగవుతో ననుట, సంతకములేని యుత్తరమువ్రాసి కవరులోనుంచి "మీకు ఉత్తరము వచ్చింది, చూడండి"

అని యిచ్చి చదివినపిమ్మట " కొద్ది రోజులలో మీరు తండ్రి అవుతారనియేనా అందులోని విశేషం." అని శుభవార్త తెలుపుసతి మధురభాషణములు — ఇదంతయు మ్మానులోరు విలాసము. ఇట్టివి దంపతుల దైనికజీవితమునకు ఉత్తేజము, ఉజ్జీవము కలిగించును.

రంభయై, మాతృదేవియై, మంత్రియై ఆయా సమయము లందు సతి పురుషునియెడ ప్రవర్తించవలెనని చెప్పి అంతటితో మానివేయుటకంటె పతి సతియెడ ప్రేమికునివలె, తండ్రివలె, తల్లివలె, సోదరివలె, సోదరునివలె, చెలికత్తెనతె వర్తించవలె ననుట ఉచితము. సరసము.

సంతానము కలుగుటతోడనే దాంపత్య సౌఖ్యము సన్న గిల్లునని, పెండ్లి పెద్ద బంధవంటిదని కొందఱు వివేకుహితులు కానివారు విచిత్రవాదము చేయుట కలదు.

ప్రకృతిలో జంతువులు, పక్షులు, క్రిమికీటకాదులుసయితము దాంపత్యసౌఖ్యము ననుభవించుచున్నవి. మానవుడు ప్రకృతి సంతానమున నుత్తమజీవి కనుకనే, అతడు ప్రేమానందయోగి అగుచున్నాడు. మానసికమైన ప్రేమానందము జంతువుల, పక్షుల, క్రిమికీటకాదుల జీవితములందు ఇదికూడా శూన్యము. ఇదికూడా మానవుడు సర్వజీవులలో అత్యుత్తముడనుట కొక హేతువు. మానవుడు ఎక్కువ వివేకజ్ఞానములవల్లనైననేమి, బుద్ధిమాంద్యమువలననైననేమి, పరమేశ్వర ప్రసాదితమైన

తను = [illegible] — [illegible] పరిష్వంగమున సర్వలోకములు [illegible] సౌభాగ్యసర్వస్వము, ఇంక నెన్నియో ఆశలు, ఆశయములు, [illegible] అంతయు మిథ్య:

"[illegible] జీవితము అనందనమ్మిళిత మని భ్రమసితిని. [illegible] విహారావృతము"

ఇట్లు [illegible] ఆమెకు ఆనంద మనలే లేకపోలేదు. అంధకార[illegible] మెరిసే తారలు; కారుమబ్బులనడుమ తళుకు[illegible] డవ; కురూపియైనను కోకిలకు మధుర [illegible]; కంటకములనడుమనే కమనీయమైన పూలవాసన; [illegible] ప్రకృతి స్వాభావలక్షణము.

[illegible], జాతుజీవితమువలె జరిగిపోవుచున్న ఆమె మానసమున [illegible] పసిపాప చిరునగవు ఒక సంతోష రేఖ; ప్రియుని [illegible] యొక్క ఆకాంక్షాతిర్ణత; అటులే ఆ నిస్తేజ జీవనమున అపు డపుడు ఆనంద భానూదయము, అంతలోనే అస్తమానము. పురుషుని జీవనవాహినికూడ నిటులే కంటక సంయుతమైన [illegible]నే నడుచుచున్నది.

చిన్ననాటి తియ్యని కల లన్నియు నే డాతనికి కల్లలైనవి. ఇట్లు జీవము లేని పతీపతుల సంతును జీవితమును కామము, మోహము, ప్రేమ — ఈ త్రిమూర్తులును నిరంతరాయముగ ఈనాడే కాదు — యుగయుగములనుండి పరిపాలించి, నిరవధికమైన నిస్తులమైన సుఖమును ఆనందమును ప్రసాదించుచున్నవి. అవియే లేకపోయిన లోకము శూన్యము.

(గృహలక్ష్మి: 1930 జూలై)